

పశ్చిమబెంగాల్ సెక్రటేరియట్ భవనం (ఆసియాలోకల్లా పెద్దది)

ఫొటో : ఎస్. వి. రమణ—విశాఖపట్నం.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 45
13-7-55

మన్మథ ఆషాఢ బహుళ అష్టమి బుధవారం



"మత్స్య ప్రదేశ్" దృశ్యం.

ఏకాంకిక : 2

# ఝాన్సీ లక్ష్మి

గుడిమెళ్ల బాలా త్రిపురసుందరి

"ప్రాతరలందుంచఁబడిన విఘ్నేశ్వరు
కోసమో తొలుకలు కుద్దలించె
ఒక కన్ను గ్రుడ్డిదయ్యెను గాక మొండెఁ బో
సిన ధాన్యలక్ష్మి ముక్కున విడిచెఁ

గందియు జనుమును గాయ తెండిన లోవి
గింజలు గలగల గిలకరించెఁ
బచ్చి పసుపు దుంప బాలెంతరాలునాఁ
బసిమితో నందమ్ము బాదరించె

మింటమంచున కిలమీఁద మెట్టపంట
పసిమి కొదుగక తప్పక వచ్చెఁ గాని
గండు తొండలు పట్టెఁ పగ్గాలు గలవె
మహిత హేమంత మెల్ల గ్రీష్మముగఁ జేయ—"

[—కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన "ఝాన్సీలక్ష్మి" నుండి.]

## పాత్రలు

ఝాన్సీలక్ష్మి—మాతృభూమి నొక దేవాలయముగా చేసిన మహారాజ్ఞి.

పెదకన్నయ్య—కృషీవలుడు.

మల్లి—అతని భార్య.

చంప—అతని కూతురు.

మోతీరాం — అతని అల్లుడు,

బాటసారి—

(దృశ్యము—గ్వాలియర్ కోట కావల జొన్న చేను.

సమయము — 1858 వ సంవత్సరమున డిసెంబరు నెలలో ఒకనాటి సాయంకాలము.

సూర్యుడస్తాద్రి ఎక్కాడు. ఆకాశమంతయు విక్షిప్త రక్తారుణిమలో మునిగి వింత కాంతు లీనుతోంది. నీరెండ కుంచుకు పోతున్న కొలది మెల్లి మెల్లిగా హిమాంశు బింబము పైకి లేస్తోంది.

ప్రాగ్దిశను ఒక మఱ్ఱిచెట్టు. చెంతనే క్షితిజాన్ని కలుసుకొనుటకు పోవు కాలిదారి. ప్రతీచిని జొన్న చేను. జొన్న చేనున కావలనున్న ప్రాచీన దేవళము యొక్క శిఖరం అగుపిస్తుంది.

మల్లి వయస్సు ఏబది యేండ్లు. నెనక పూరైక తొడిగింది. నోటిదురుసుగలమనిషి. దారి ప్రక్క కూర్చుంటుంది. ఆమె పార్శ్వమున చితుకులతో నిండిన తట్టవడి ఉంటుంది. కన్నయ్య వయస్సు అరువది యేండ్లు. ముడుతలు బడిన నొసలు. మృదుభాషి. మల్లి ప్రక్క చతికిలబడి కూర్చొని ఉంటాడు. వాడి కాళ్ల దగ్గర పార, తొట్టిక, కొడవలి పడి ఉంటాయి.)

కన్నయ్య: ఇంకా ఫిరంగులు మోగుతున్నాయి.

మల్లి: (ఎటకారంగా) జగత్తు మిథ్య అని శాస్త్రులువారు చెప్పలే?

కన్నయ్య: బాగానే ఉంది మెట్టవేదాంతం. చెవులున్నవాళ్లకల్లా అక్కడ యుద్ధం సాగుతున్నట్లు తెలుస్తుంది.

మల్లి: (ఆవేశంతో) ఔను. సాగుతుంది. సాగదు మరీ? కలకాలం సాగుతుంది. తెల్లవాళ్ళలోని కజ్జాకోరుతనం సమసిపొయ్యే వరకూ యుద్ధాలు సాగుతాయి.

కన్నయ్య: (విషాదంతో) ఇదంతా విచిత్రంగా ఉంది.

మల్లి: ఏమిటి?

కన్నయ్య: దినాంత రమణీయ సాంధ్య రాగము ఒప్పుల కుప్పగా చిప్పిలుతోంది. నీడాభిముఖులైన పులుగులు టెక్క లల్లారుస్తూ, తియ్యగా పాడుతున్నాయి. ప్రకృతి అంతా కలకలలాడిపోతోంది. ఈ సమయంలో యుద్ధ కోలాహలం స్వచ్ఛమైన తెల్లటి బట్టమీద అంటిన కల్మషంలాగ అసహ్యంగా ఉంది.... మన మిక్కడ కంకి వదలిన లేతకొరు జొన్న చేలో పిట్టలను తోలుతూ కూర్చున్నాము. ఆ బురుజుమీద (కోటకేసి చూపుతూ) మన అబ్బాయి ఎల్లా ఉన్నాడో, ఏం చెప్పగలం?

మల్లి: నేను వద్దురా అంటే వినకుండా వెళ్ళాడు...(కోపంతో) మా తెలుగాళ్లందరూ రణదేవతకు జాతర చేస్తూ, ఒకరి తల ఒకరు బద్దలు కొట్టుకొంటూంటే, మా ఆడవాళ్ల ఖర్మకాలి దెబ్బలు తిన్నవారికి కట్లు కట్టడం, వితంతువులను ఓదార్చడం చెయ్యవలసి వస్తోంది. వీరు చేసిన తప్పులకు బ్రహ్మదేవుడు మమ్మల్ని సంజాయిషీ అడుగుతాడు.

కన్నయ్య: నువ్వు ఎప్పుడూ కత్తి విరచినట్లు మాట్లాడతావు మల్లీ! ఇప్పుడూ కౌకలుతీరిన మనజోదుల్ని యుద్ధరంగంలో వీరరసశృంగారితులను చేసే వీరమాత ఎవరంటావు? స్వర్గశిల్పి చెక్కిన అపురూప భారత గౌరవప్రతిమూర్తి ఎవరంటావు?

మల్లి: పురుషుని వేషంలో తగుదునమ్మా అని టింగురంగా అని గుర్రాన్ని ఎక్కి కత్తి త్రిప్పే ఆడదాన్ని ఇంతవరకూ నేను చూడలేదు.

కన్నయ్య: అవునైతే యేం? తెల్ల దొంగల్ని ముప్పతిప్పలు పెట్టి వాడు చెరువుల నీళ్లు తాగిస్తోన్నప్పుడు?

మల్లి: ఆ - దానికేం లెండి. ముందుంది ముసళ్ల పండుగ. ఝాన్సీరాణీ ఎక్కడు, ఏ

కన్నయ్య: (గద్గద కంఠంతో) అహో! భరతఖండంలో మూలమూలలా ఇవ్వాడు కన్నీటి పాటలు వినిపిస్తాయి. మన లక్ష్మి ఇక రాదంటారా? ఉప్పొంగిన వీరరస సాగర గర్భాన్ని పడిన ఆణిముత్యాల నేరుటకు ఆ మహాతల్లి వెళ్లిందంటారా? నిజంగా ఇంక కంటికి కనుపించదంటారా? (బాటసారి చెయ్యి పట్టుకొని ఊపి) సరిగా చెప్పండి.

బాటసారి: బిచ్చగాడైనా ఆమె ఆత్మత్యాగానికి కంటి కన్నీటి రత్నాల కానుక విడక మానడు.

మల్లి: ఆమెకి నిజంగా దెబ్బ తగిలిందంటారా?

బాటసారి: ప్రబల గాయం తగిలిందని చెప్తున్నారు.

మల్లి: (విచారంతో) పాపం.

కన్నయ్య: (నిస్పృహతో) స్వాతంత్ర్య సౌధం మంట కలిసింది.

బాటసారి: (నిర్వేదంతో) ఈతి బాధలలో ఇక భారతదేశం అట్టుడికినట్లు ఉడికి పోతుంది.

మోతీరాం: (కౌతుకముతో) తెల్ల దొరలు గ్వాలియరు పట్టుకొని ఉంటారు. గానా బజానా † లతో వాళ్ల విడిది నాట్యరంగంగా మారిపోయి ఉంటుంది. (విచారంతో) దరిద్రగొట్టు వెధవని - ఇక్కడ చతికిలపడిపోయా. ఈ సమయంలో అక్కడుంటే ఎంత చక్కగా ఉండునో కదా!

[నేపథ్యంలోంచి ధ్వని - పాషాణాలకు ప్రాణంపోసిన పరంజ్యోతికి కర్పూర నీరాజనాలివ్వండి. మన గడ్డపై స్వాతంత్ర్య పిపాసను ఉద్దీపనం చేసిన కుంకుమశోభకు జోహారు చేయండి.]

[అందరూ సంభ్రమంతో చూస్తూ ఉంటారు. చంప ప్రవేశిస్తుంది. చినుకు పడీ పడకముందే దుముకి చెంగి గుటుక్కున మ్రింగు చాతకమువలె చంపను చూడగానే మల్లి కూతురుయొక్క ఉన్మత్త ప్రేలాపనకు ఆమెను కోతపెట్టుట ఉపక్రమిస్తుంది. కన్నయ్య మల్లినిపట్టి వెనుకకు లాగుతాడు. మల్లి నోరుమూసుకొని ఉంటుంది.)

చంప: మొగలిపూబొత్తుల పువ్వుతోట కంచెల ప్రక్కనుండి కొండమల్లితోపు దాటి అశ్వారోహియై ఆమె వచ్చింది. గుఱ్ఱపు డెక్కల తాకిడిచే పాషాణాలు పిండియై మింటి కెగసిపోయాయి - మంచు తెరలను తొలగించుకొని పసిడికాంతులను వెదజిమ్మే తొగరు వన్నెగల ఉదయ భాస్కరునిలా ఆమె ముఖం ముద్దులొల్కుతోంది.

మల్లి: ఎవరే, ఆమె?

చంప: ఈ దేశాను క్రొత్త పరిమళంతో సురభిళం చేస్తున్న మన తల్లి. ఆమె పేరు విననివారున్నారా?

మల్లి: ఆమె ఎక్కడికి వచ్చిందంటావు?

చంప: కోటకి ప్రదక్షిణంచేసి ఇటే వచ్చింది. (ఉద్రేకంతో) ఎల్లా మెరిసి పోతోందనుకున్నావు? ఆ తళుకు చూడడానికి వెయ్యికళ్లు చాలవు. ఆమె పాదాలకి మ్రొక్కితే జన్మతరిస్తుంది.

మోతీరాం: నీ గొడవ బాగానే ఉంది. ఈయనెవరో వచ్చి (బాటసారిని చూపించి) ఝాన్సీలక్ష్మి మట్టిలో కలిసిపోయిందంటే, ఆమె ఇల్లా వచ్చిందంటావేమిటి?

చంప: (నిట్టూరుస్తూ) నా కళ్లను నేనే నమ్మలేనా?

బాటసారి: ఔను తల్లీ! ఆ యువకుడు చెప్తోన్నది తథ్యమే.

మోతీరాం: విన్నావా? ఇక నడు. గొడ్లను తోలుకరా. ఇంక పోవేం?

చంప: (ఏడుపుముఖం పెట్టి) అల్లా గద మాయిస్తే నేనేం చేసేది? ఆ దివ్యప్రభను కళ్లారా చూశాను. ముమ్మూర్తులా ఝాన్సీలక్ష్మియే. నేనేమి చెప్పను? నేత్రాలకు అమృతవర్తి ఆమె. ఆమె పాదాలకు మ్రొక్కి ఆమె ఆశీర్వచనం పొందనిదే ఏమైనాసరే ఇక్కడనుంచి కదలను.

మల్లి: మంకుపట్టు ఆడవాళ్లకు తగదమ్మాయీ! మోతీమాట నువ్వు వినవలసి ఉంటుంది.

కన్నయ్య: దాన్ని మీరేమీ అనకండి.

చంప: (మోతీతో) కాసేపటిలో ఆమెను మీరే చూస్తారు. చూడనూ చూస్తారు, పాదాలమీద మోకరిల్లనూ మోకరిల్లుతారు.

మోతీ: ఇంక కట్టెయి నీ పురాణం. ఆడదానికి దోసిలొగ్గే ఘటంకాదిది. మీ అమ్మ మీదుంచే భక్తికొద్దీ నేను యుద్ధానికి పోలేదు. అక్కడ మీ అన్న నెత్తురే ఓడ్చ వలసివస్తుందేమోనని భయపడ్డా.

మల్లి: (కోపంతో) ఓహో! నాయందుంచే భక్తిచేత యుద్ధానికిపోలేదంటావా? క్షేమంగా వుంది. నాయందు గౌరవంలేకపోతే ఝాన్సీ వాళ్లందర్నీ పొట్టపెట్టుకోడానికి సిద్ధంగా ఉన్నావన్నమాట.

చంప: అమ్మా! అముక్క గట్టిగాఅడుగు.

మల్లి: (మోతీతో) నువ్వేదేశంలో పుట్టావు?

మోతీ: (పులకనభావంతో) ఝాన్సీలో పుట్టలేదు.

చంప: (వెటకారంగా) అమ్మా! అందుచేత యీయనకీ భారతదేశానికి సంబంధం లేదు, పాపం. తర్కంకూడా చదువుకున్నట్టుందీయన.

మోతీ: నేను కంపెనీ ఉద్యోగస్థుణ్ణి. తెల్లవాళ్లు ప్రపంచాన్నంతా ఆవరించుకొన్నారు. వాళ్లరాజ్యంలో రవి క్రుంగడు. తెలుసా? అందుచేతే వాళ్లని చేపట్టేను.

మల్లి: బాగున్నాయి చిలుకపలుకులు.

కన్నయ్య: చిలుకపలుకులు కావు. అంధవిశ్వాసాలు, గుడ్డినమ్మకాలు మనమనస్సులో ఇల్లు కట్టుకున్నాయంటే బోనుల్లోపడ్డ ఎలుకల్లా ఇక అవి బయటకుపోవడానికి అవకాశం ఉండదు.

మోతీ: తెలిసీ తెలియనివాళ్లకు తెలియచెప్పటం బ్రహ్మకైనా తరంకాదు. ఇంగ్లీషువారు మన సార్వభౌములు.

బాటసారి: వహవ్వా! లక్నో, ఢిల్లీ, ఆగ్రాలలోంచి చప్పుడుకాకుండా పలాయనమంత్రం పఠించినవాళ్లు పరిపాలకులంటే ఎవరైనా నవ్వుతారు. కాలికివచ్చి పాలికిమాట్లాడినవారు ఏదోరోజున నెత్తి మీద గుడ్డవేసుకొని పోవలసిందే.

మోతీ: మీరంతా కూపస్థమండూకాలు. ఝాన్సీయే మీ విశ్వం.

చంప: తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లను వాడితో వాదించడం నీడతో కుస్తీ పట్టడంవంటిది. కుస్తీపట్టేవాడు ఇట్టే అలసి పోతాడు. నీడమాత్రం చెక్కు చెదరక అట్లే ఉంటుంది.

బాటసారి: చక్కనిమాట చెప్పావు తల్లీ నీ కడుపు చల్లగా. (అటునిటుచూచి) చీకటి బాగా ముసురుకుంది. మార్గం అగుపించడం లేదు. త్వరగా వెళ్లి ఏ దేవాలయ మండపం మీదో యీ రాత్రి వెళ్లబుచ్చాలి.

మల్లి: దేవాలయాల మరుగున తెల్లవాళ్లు ఫిరంగులు బిగించారు. అప్పటినుండి కోట పైకి గుండ్లు బారుచేస్తున్నారు. అటు పోతే

† ఆట పాటలతో.

 ఝాన్సీ లక్ష్మి 

కొత్తవారలు మిమ్మల్ని శత్రు మూకలోని వారని ఊహించి కాలుస్తారు. ఈ రాత్రి మా కుటీరాన్ని పావనం చేయండి. మాతోపాటే కలో గంజో తాగొచ్చు.

కన్నయ్య: దయతో మా ఆతిథ్యం స్వీకరించండి. ఆ కొండ వెనుకనున్న వర్తకుల మూకే. ఇదిగో యీ లాంతరు తీసుకెళ్ళండి. (మోతీ చేతిలోని లాంతరు బాటసారి కిస్తాడు).

బాటసారి: మీ ఔదార్యానికి కృతజ్ఞుణ్ణి. (లాంతరు తీసుకొని వెడతాడు.)

కన్నయ్య: ఓరుగాలిలో అరు బయట రాత్రులందు ఉండటం మంచిది కాదు. ఆరోగ్యం చెడుతుంది. రండి పోదాం.

మల్లి: దెయ్యాలు భూతాలు తిరిగే వేళ ఇది.

మోతీ: (నవ్వుతూ) బానకంత పొట్టగల మూతివాళ్లు దొంగకోళ్ళనుపట్టే కోరమీసగాళ్ళు విచ్చలవిడిగా తిరిగే సమయం. పదండి పోదాం.

(తెరలో అడుగుల చప్పుడు)

మల్లి: ఏమిటో ఆ చప్పుడు?

చంప: ఆమె వస్తోంది.

మల్లి: (కసరుకొంటూ) ఇంకా ఆ జపం వదలిపెట్టవా? ఏమిటది? ఏదో భూతమై ఉంటుంది.

మోతీ: (వణుకుతూ) ఝాన్సీ లక్ష్మి భూతమే అది. సందేహం లేదు. పొంచుకు ఆమె చనిపోయిందని చెప్పారుగా!

మల్లి: (కన్నయ్య చెయ్యి అదిమి పట్టుకొని) దయ్యం పీక నులిమేస్తే ఏం చేస్తాం?

మోతీ: అత్తయ్యా! భయపడకు అంజనేయ దండకమంటే భూతాలకు హడల్.

శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం.. త్వరగా పోదాం రండి—

కన్నయ్య: అత్తకు తగ్గ అల్లుడే.

[అందరూ ఇంటికి వెళ్ళడానికి లేస్తారు. సైనికుని వేషంలో ఝాన్సీలక్ష్మి ప్రవేశం.]

మల్లి: (లక్ష్మిని ఉద్దేశించి) భలే మొనగాడివే నోయి నువ్వు—

మోతీ: ఎక్కడి నుండో ఊడిపడ్డావు.

కన్నయ్య: నీ అడుగుల చప్పుడు విని ఏదో అనుకొని గాభరా పడ్డాం.

మల్లి: గాభరాపడడమేమిటి? సగం చచ్చేను.

ఝాన్సీ: మీకింత భయమెందుకు? దేశద్రోహి ఒక్కడే ఎన్నడైనా తన హృదయాన్ని చంపుకొని శాంతకుడిలా బెంబేలుపడాలి. మిగిలినవారు గుండెలమీద చేయివేసుకొని హాయిగా నిద్రపోవచ్చు.

మల్లి: అబ్బో! మాటలు కోటలు దాటుతున్నాయి.

మోతీ: అంత ధైర్యం కలవాడివి గనుక్కనా ఎందుకు అక్కడనుంచి (గ్వాలియర్ కోటను చూపి) పారిపోయివచ్చావు?

ఝాన్సీ: పారిపోయివచ్చానని చెప్పడానికి నీకు నోరెలా వచ్చిందయ్యా? ఎప్పుడైనా, ఏ భారతవీరుడైనా రణరంగంలో వెనుచూపడం ఎరుగుదువా?

మోతీ: అత్తయ్యా! ఈ కుర్రాడు భలే తెలివైనవాడే! కత్తి పట్టుకోడం తెలుసునో తెలియదో గాని మాటల్లో ఆడంబరం మహాబాగా ఉట్టిపడుతోంది.

మల్లి: (ఝాన్సీరాణితో) అబ్బాయి! నీవు యుద్ధరంగంనుంచే వస్తున్నావా?

ఝాన్సీరాణి: ఔను.

మల్లి: మా అబ్బాయి సంగతి తెలుసా? మా వాడి పేరు చైతన్యరాం.

ఝాన్సీరాణి: మీవాడు కుశలమే. మీ వాడి ప్రాణానికి నా ప్రాణ మడ్డు. భారత చరిత్రలో అట్టి వీరుల పేర్లు పైడి అక్కరాల వ్రాలుతై ధగధగ మెరుస్తాయి.

కన్నయ్య: అబ్బాయి! నీ మాటలు విని మురిసిపోతున్నా. కలంపోటులోను, కత్తి పోటులోను కూడ అద్వితీయుడవలె ఉన్నావే?

మోతీ: మా వెఱ్ఱిమామ మెచ్చి బంగారాన్ని బంగారమనుకొంటాడు.

కన్నయ్య: మోతీ! పిరికివాడి మదిలో కింకంలాగ నీ మాటలు పసచెడుతున్నాయి.

ఝాన్సీ: (మోతీతో) ఏమయ్యా! స్వాతంత్ర్యసమరంలో తన సర్వస్వాన్ని హృదయం గల ప్రతిభారతీయుడు ఆహూతి చేస్తున్న కాలంలో మూలనక్కి కూర్చున్నావా? గాజులు తొడిగించుకొన్నావా?

మోతీ: ఓహోహో! పాకం ముదిరిందే! పిట్ట కొంచెం కూత ఘనం - వదరబోతా! మితిమీరినమాటలకు శిక్ష మాపణ లేదు కొంటావా? భరతం పట్టమంటావా? (త్రోల్లిక నెత్తుతాడు కోపంతో)

కన్నయ్య: (మోతీ చేతిలోంచి త్రోల్లికను లాక్కొని) అను - అను - మోతీ - ఏదో అఘాయిత్యం చేసేట్టున్నావు.

ఝాన్సీ: తాతా! నువ్వు అట్టే ఖంగారు పడకు భారతభాగ్యరేఖ తిన్నగా ఉంటే నన్ను ఎవ్వడూ ఏమీ చేయలేడు.

మోతీ: వహ్వా! భారతభాగ్యరేఖకు పిడి దివిటీజీవితానికి ముడిపెడుతున్నాడు. (వెక్కిరిస్తూ) ఏమిరసికత! ఏమిచాతురి!

ఝాన్సీరాణి: దీపముండగే వెలిగించు మోతీ!

మోతీ: బాగుంది వ్యవహారం, గుర్తువచ్చి పిల్లను వెక్కిరించింటు. నిన్ను కొక మెన్ని పటాలంలో చేరిస్తుంటావు. మిడిసిపడిపోతున్నావు. నేను కంపెనీలో పక్షేళ్ళనుంచి సిపాయిగా పనిచేస్తున్నాను, తెలిసిందా? ఇంకా నాకు పనులు పురమాయించకేం? నీవు పురమాయించినా నీమాట వినే దద్దమ్మను కాను లే.

ఝాన్సీరాణి: నీ తల్లి ఎదుట ఇల్లాగే మాట్లాడుతావా?

చంప: బాగానే అడిగేరు. ఆ కంపెనీలో చేరిన తరువాత ఆయన తల బరువెక్కిపోయినది

మోతీ: (నవ్వుకొని ఝాన్సీరాణితో) భలే మాటకారివే!

ఝాన్సీరాణి: కోటలోకి వస్తావా?

మోతీ: నీ దారిని నువ్వు పో. నా గోల నీకెందుకు? వాదన పెంచకు. నాది వెఱ్ఱి కోపము.

ఝాన్సీరాణి: (చిరునవ్వుతో) అది నీ మిత్రులమీద చూపకేం?

మోతీ: (ఆశ్చర్యంతో) సిపాయివైకూడా ఇంత మృదువుగా, ఇంత తియ్యగా ఇల్లా మాట్లాడడం ఎక్కడ నేర్చుకొన్నావోయి*?

ఝాన్సీరాణి: మాతృదేవి శ్రీ చరణాల వద్ద నే నడిగిన ప్రశ్నకు ఏం సమాధానం చెప్తావు?

మోతీ: పనికిమాలినవాళ్లు ఆడదాని బావుటా క్రింద జేరుతారు.

కన్న: (ఝాన్సీరాణితో) అబ్బాయీ! తా చెడ్డకోతి వనమెల్ల చెరచినట్లు మావాడు నిన్ను ఒక్క క్షణంలో పాడుచేయగలడు. నే చెప్పినమాట విని వీడిని వదలి వెంటనే వెళ్ళిపో. నీకు పుణ్యముంటుంది.

ఝాన్సీరాణి: భగవంతునికృప ఉన్నంతవరకు అది అసాధ్యమే అని చెప్పాలి, తాతగారూ!

మల్లి: మోతీ! ఆ రాచకార్యాలేమిటో రేపు మాట్లాడుకోవచ్చు పోదాంరా.

మోతీ: నువ్వు వెళ్లు అత్తయ్యా! కాసేపటిలోవచ్చి నిన్ను కలుసుకుంటా.

మల్లి: ఆలస్యం చేయకు.

మోతీ: ఊఁ (బుట్టతీసుకొని మల్లి వెడుతుంది. ఆమె వెనుకనే పార, త్రోల్లిక పుచ్చుకొని కన్నయ్య వెడతాడు).

మోతీ: (ఝాన్సీలక్ష్మితో) అబ్బాయ్! నువ్వు ఝాన్సీలక్ష్మిని చూచావా?

ఝాన్సీరాణి: పుట్టినప్పటి నుంచి ఆమె నెరుగుదును.

మోతీ: ఆమెను గూర్చి నీకు తెలిసి ఉన్నది చెప్పు. ఆమె సైనికులకు తరచు బకాయిలు పెడ్తోందిట.

ఝాన్సీరాణి: అది అబద్ధం. ఇక లక్ష్మిని

*సాధారణంగా సిపాయీలవద్ద బూతుల యొక్క బృహత్ గ్రంథం ఉంటుంది.

గురించి చెపుతా విను. సృష్ట్యాదిలో భారత హృదయ మందిరంలో ఒక తేజ స్వరూపిణి వెలసింది. ఆమెకు ముప్పది కోట్ల మంది బిడ్డలు. ఇటీవల కొందరు ముష్కరులు ఆ శ్రీమంతురాలి బిడ్డల్ని దరిద్రదేవత కప్పగించి వాళ్ల ధనధాన్యాలను కాజేయుట మొదలెట్టారు. ఇది చూసి తేజస్వరూపిణి పెద్ద కూతురు సహించలేక సోదరులను ప్రోత్సహించి స్వగృహంలో తిష్ట వేసుకొన్న ముష్కరులను వీధిలోకి పారతోలుతోంది. ఆమె పేరు లక్ష్మి. భారతదేశం ఆమె పుట్టిల్లు.

**మోతీ:** అంతా బాగానే ఉందిగాని కీడెంచి మేలెంచుచున్నారు. ఇతర సంస్థాన రాజులు తెలివితక్కువ వారా? వాళ్లలాగ యీమె కూడ ముక్కు మూసికొని ఉండవలసింది.

ఝాన్సీరాణి: కీడెంచి మేలెంచుట మంచిదే. భారతీయులు ఓడిపోతారని నీ బెంగ. ఒక్క ఓటమి వంద జయాల పెట్టు. ఝాన్సీ లక్ష్మికి జయాపజయాలతో నిమిత్తంలేదు. భారతీయుల హృదయములను పదును చేసి, స్వాతంత్ర్య బీజాలను చల్లి వారల జీవితములను పండించుటయే ఆమె ఆదర్శం. భూమిలో నాటిన బీజం భూమ్యాకర్షణ శక్తిని సైతం ధిక్కరించి నింగిపైకి మొగ్గలు పెట్టుటకు లేస్తుంది. అట్లే మంచి ఆదర్శాలు కూడా. పైగా కొండ ఎక్కదలచినవాడు జారిపడతాననే భయంలో గుటకలు మ్రింగుతూ కూర్చుంటే ఎక్కడ కూర్చున్నవాడు అక్కడే ఉంటాడు.

**మోతీ:** నీవు ఝాన్సీ లక్ష్మి అయినట్లే ఉపన్యసించావు. ఆమె అంటే నీకు మంచి భక్తి కాబోలు. నాక్కూడా ఆమెయందు [illegible] గౌరవం ఉన్నా ఆవిడ తలపెట్టిన కార్యానికిది సరియైన సమయం కాదని సంశయిస్తున్నా—

ఝాన్సీరాణి: (ఉద్రేకంతో) భారతమాత రోదన ధ్వనిని విని ఆమె రణరంగంలోకి ఉరికింది. భగవంతుని సాయం ఆమెకేదోడై ఉంటుందని నా నమ్మకం.

**మోతీ:** నీకేం తెలుసోయ్! పిల్ల కాకికి ఉండేలుదెబ్బ ఏం తెలుస్తుంది?

ఝాన్సీరాణి: నీబోటివాళ్లందరూ సహకారం కట్టుకుంటే ఆమె తపస్సు ఫలిస్తుందని ఆమె ఘోషిస్తోంది. భారతమాత సేవ చేద్దాం వస్తావా?

**మోతీ:** నీలిమందు తొట్టెలోపడ్డ నక్క వేదాంతలా వుంది నీది. ఆమెతో ముఖాముఖీని మాట్లాడితేగానీ నేను ఏనిశ్చయానికీ రాలేను. కాని అబ్బాయి! నీమాటలు నా హృదయంలో కలవరం లేవదీశాయి. నీతో రాకపోయినా ఝాన్సీ లక్ష్మిని చూసే వరకూ నాకు నిద్రపట్టదనుకొంటా.

ఝాన్సీలక్ష్మి: భారతమాత పేరుమీద తిరిగి అడుగుతున్నా దేశసేవకు వస్తావా?

మోతీ: సిద్ధంగా లేను. నువ్వేమీ అనుకోకు.

చంప: అయ్యా! మీమాటలువింటూంటే ఝాన్సీరాణి వచ్చి మాట్లాడుతున్నట్టుంది. చీకట్లో మీ ముఖము నాకు అగుపడటంలేదు. మీ ప్రబోధానికి నా వందనాలు.

(తెరలో అడుగుల చప్పుడు)

ఝాన్సీలక్ష్మి: (చంపతో) ఓ కుంకుమ శోభా! వీరమాతవు కావమ్మా! భారతభూమి వన్నెచిన్నెలు నీ ఒడిలో పెరిగి మిన్ను ముట్టుగాక! ఎవరో వస్తున్నారు. నే నింక పోవలసిఉంది. (మోతీతో) **మోతీ!** భారతమాతసేవకు నిన్ను తీసుకొని పోజాలకపోతున్నా. నా దుఃఖానికి మేర లేదు. ముందైనా భగవంతుడు నీకు సుమతి ప్రసాదించుగాక!

(ఝాన్సీలక్ష్మి నిష్క్రమిస్తుంది. రెండో వైపునుంచి సైనికుని ప్రవేశము)

సైనికుడు: ఇక్కడ భారతసైనికులు ఎవరైనా ఉన్నారా?

చంప: ఇప్పుడే ఒకసిపాయి ఇల్లావెళ్లారు.

(సైనికుడు ఝాన్సీరాణివెళ్ళినదిసగా పోబోతాడు. మోతీ వాడినిపట్టుకొని ఆపుతాడు.)

మోతీ: సిపాయీ! నాకు ఝాన్సీరాణిని చూపిస్తావా?

# దత్తుడు

**ఎమ్. ఎస్. ప్రకాశరావు**

శ్రీనివాసరావు హస్తాన్ని చూసి, "నీది 'ఎమియబుల్' స్వభావం" అన్నాడు హస్తసాముద్రికం తెలుసున్న ఓ మిత్రుడు. ఎమియబుల్ అనే పదానికి చాలా అర్థాలు చెప్పవచ్చును. సౌమ్యత, మృదుత్వం ఇతరులను సంతోషపెట్టే వాకచక్యం ఇత్యాదయః. ఇవి కాక ఎక్కడుంటే అక్కడ, ఆ వాతావరణానికి సరిపడిపోయే స్వభావాన్ని కూడా 'ఎమియబుల్' అనవచ్చు. శ్రీనివాసరావు విషయంలో అమాట చాలా వరకు నిజం. అతను చాలా మెత్తని మనిషి. ఇతరులకి తనవల్ల వుపయోగం వుంటే, ఎంత శ్రమకయినా వోర్చి సాయం చేస్తాడు. అన్నిటికన్న మించి అతను ఎటువంటి సొసైటీలో తిరిగినా కొత్తదనం వల్ల బాధపడడు. పరిస్థితుల కనుగుణంగా తాను మారిపోతాడు కాని, 'అయ్యో, ఇలాంటి మార్పు వచ్చిందే' అని బాధపడడు. అలా అని అతను పూర్తిగా ఏ ఎండకా గొడుగు పట్టేవాడు కాడు. కొన్ని కొన్ని విషయాలలో అతనికి దృఢాభిప్రాయాలున్నాయి. ఆరు మూడయినా, మూడు ఆరయినా, వాటి నతడు మార్చుకోలేడు. సాముద్రిక శాస్త్రం ఇంకోలాగ ఎంతఘోషించినా సరే. మాటవరసకి ఇతనిచే సిగరెట్ కాల్పించడానికి కనేకులు ప్రయత్నించి విఫలులయ్యారు. రోజుకి గ్రోసులు గ్రోసులు లెక్కనిపీల్చేసే మరాథాన్ పొగ త్రాగుడుగాళ్ళమధ్య అతను జీవితం చాలా నెలలు వెళ్ళిగించాడు. ఒక్క సిగరెట్ అతను ముట్టుకోలేదు. వాళ్ళచే వొకటి తక్కువ కాల్పించ ప్రయత్నించలేదు. అతనిది ఎమియబుల్ స్వభావం కదా అని, మెత్తపు మనిషిని తమకి కావలసిన ఆకారంలో ఇతనిని తయారుచేయాలని చాలామంది ప్రయత్నించారు. వాళ్ళల్లో అతని పినతల్లి శేషమ్మ గారు వొకరు.

శేషమ్మగారంటే అందరిపినతల్లులవంటిదీ కాదు. ఆవిడ కత్తిలాంటి మనిషి. ఆవిడ అవునన్నదానిని కాదనడానికి భూమిమీద నూకలపై ఆశవున్నవా డెవడూ సాహసించడు. అలా అని ఆవిడని రాకాసి అనడానికి వీలులేదు. ఆవిడ అనవసరంగా నోరు జారదు. చేతులు వూపుకుంటూ ఇటు ఏడుతరాలవాళ్ళ్ని, అటు ఏడుతరాలవాళ్ళ్ని దుమ్మెత్తిపోయదు. మరి ఆవిడంటే అందరికీ ఎందుకు భయమంటే ఏం చెప్పం? ఒక్కొక్కళ్ళ వదనంలో వుంటుంది కాబోసు ఆ గాంభీర్యమంతా. వాళ్ళని చూసి తిలవొంద బుద్ధిపుడుతుంది కాని ఎదిరించ బుద్ధి పుట్టదు. దానికితోడు ఆవిడ భర్తగారు కేంద్రప్రభుత్వంలో గజెటెడ్ ఆఫీసరుపనిచేసి కొద్దో, గొప్పో ఆస్తి సంపాదించాడు. ఉద్యోగరీత్యా ఆయనతో ఆవిడా బొంబాయి, కలకత్తా, ఢిల్లీ ఇత్యాదిపట్టణాల్లో వుండివచ్చింది. ఇతరులకి తెలియని విషయాలెన్నో ఆవిడకి తెలుసు. అందుచేత, ఆవిడన్నదాని కెవరయినా కాదంటే ఆవిడ, అవతలవాళ్ళకి తెలియని విషయాలు ఎన్నో చెప్పేసి, వాళ్ళని తికమకపెట్టేసి, చివరికి వాళ్ళ చేత అవుననిపిస్తుంది. అందువల్ల ఆవిడతో వక్తృత్వ ప్రసంగాలలో కెవరూ దిగరు. ఆవిడ జీవితమంతా, ఆయనగారితో దేశమంతా తిరగటంతో సరిపోయి, ఆయనగారి ఆస్తికి ఒక్క గానొక్క వలుసునయినా ప్రసాదించలేకపోయింది. ఆయన పోయేముందు ఆస్తంతా ఆవిడకి వ్రాసేసి, ఆవిడ తన కిష్టం వచ్చినట్లు దాన్ని కృష్ణార్పణం చేసేయవచ్చని, సర్వహక్కులూ ఇచ్చేసి మరీ పోయాడు. ప్రతి విషయంలోనూ ఆవిడదే పైచేయి కావడానికింతకన్నా వేరింకేం కావాలి?

అటువంటి శేషమ్మగారి కెందుకో కాని, అక్కకొడుకు శ్రీనివాసుడంటే మొదటి నుండి ప్రత్యేకాభిమానం. "వోరి, శ్రీనివాసులూ, నీవు నిజంగా శ్రీనివాసుడవురా! నీ రొట్టె విరిగి, కత్తిలేని వెన్న కాచిన నేతిలో పడిందిరా!" అన్నారు చాలా మంది బంధువర్గం. "నే నప్పుడే అనుకున్నా. వాడి జన్మకాలంలో చంద్రుడు పదకొండవ గృహంలో తీరుబడిగా కూర్చుని తన చల్లని చూపులు తెగ ప్రసరింపజేశాడు" అన్నారో శాస్త్రులుగారు. ఆ చంద్రుడసలెటువంటివాడో, వాడు పదకొండవ గృహంలో వేరే పనేమీ లేనట్లు తీరుబడిగా కూర్చుని చల్లనిచూపు లెందుకు ప్రసరింపజేశాడో శ్రీనివాసులి కర్థంకాలేదు. దానికీ తన పినతల్లి ఆస్తిమీద తనకి హక్కు రావడానికీ గల సంబంధమేమిటో అంతకన్నా అర్థం కాలేదు. ఈ వారసత్వం అవస్థాజనకమయి చివరికి మోయలేని బరువుగా మారుతుందని ఆ సమయంలోనే ఎవరయినా సూచించివున్నట్లయితే చాలా సంతోషించివుండేవాడు. అటువంటి సూచనలేం రాకపోవడంతో అతను శేషమ్మగారి ఆధిపత్యంక్రిందికి వచ్చాడు.

---

# ★ ఝాన్సీలక్ష్మి ★

సైనికుడు: ఏం?

మోతీ: ఆమె దర్శనం చెయ్యాలని ఉవ్విళ్ళూరుతున్నా.

సైనికుడు: (కొంచెం సంకోచంతో) మీతో ఇంతవరకూ ఝాన్సీరాణివి మాట్లాడుతు. ప్రశాంతముగ భగవంతుని ప్రార్థించుకొనుట కిల్లు వచ్చినది సెలవు.

(సైనికుడు నిష్క్రమిస్తాడు).

మోతీ: అయ్యో! అయ్యో! దయామయి! భరతమాత స్వయంగా వచ్చి ఎంత హెచ్చరిక చేసినా మన్ను తిన్న పాములా కదలక పడిఉన్నా. హతభాగ్యుడా మోతీ! నీ జన్మ వృథా (హఠాత్తుగా ఆవేశంతో) ఉంపా! నేను పోతున్నా: ఝాన్సీరాణి పాదాల వద్దకు పోతున్నా. తప్పు సైరించమని వేడుకొంటూ. ఆ తల్లి పేరు సూర్య చంద్రాదులతో నిలిచివుంటుంది. అత్తతో యీ సంగతి చెప్పేయి... (ఝాన్సీ రాణి పోయిన వైపు పరుగెత్తుకొని పోతాడు).

చంద: ఈశ్వరుడు ప్రతి వారికీ ఏదో సమయంలో దివ్య రూపం చూపించడానికి వస్తాడు. కాని ఎంతమందో ఆయన రాగానే పెడముఖం పెట్టి సిరిని మోకాలితో తన్నేస్తారు... ఝాన్సీరాణి అడుగు జాడలలో నడుచుటకు పోయిన నా భర్త ధన్యుడు... ఓ నామోతీ! నీ దర్శన లాలసతో నాకళ్ళు కాయలు కాసినా నీ దేశభక్తి తలచుకొని నా హృదయం నిత్యకళ్యాణం పచ్చతోరణంతో కలకలలాడుతూ ఉంటుంది. నీవు చేరబోవు ఝాన్సీదండు రామదండు. ఆ దండు నెదుర్కొనుఅధములు పాషండులు.

(తెర పడుతుంది) ★

శేషమ్మగారి భర్త చాలా క్రమబద్ధమయిన జీవితం గడిపినవాడు. ఆయన రోజూ వుదయం ఆరుగంటలకల్లా లేచేవాడు. దిన చర్య అంతా ఖచ్చితంగా టైము ప్రకారం చేసుకుని పోయేవాడు, ఒక్క నిముషమయినా ఇటూ, అటూ కాకుండా. ఈ టైమువిషయంలో ఆయన ఎంత ఖచ్చితంగా వుండేవాడంటే, ఈయన గడ్డం చేసుకునే టైము, భోజనంచేసే టైముని బట్టి చుట్టుప్రక్కలవారు తమ గడియారాల్ని దిద్దుకునేవారని శేషమ్మగారు చాలాసార్లంది! ఆయన వేషభాషలలో కూడా యీ క్రమశిక్షణ చాలా కనపడేదట. శ్రీనివాసులు కూడా అచ్చంగా అలా తయారవాలని శేషమ్మగారి కోర్కె. అతని స్వభావం దాని కెంతయినా విరుద్ధం. అతనికి రాత్రి పన్నెండింటికి పడుకుని ఉదయం ఎనిమిదింటికి లేవడం అలవాటు. ఇంకోలాగ చస్తే చేయలేడు. బట్టల విషయంలో కూడా అదే నిర్లక్ష్యం. దాంతో ఆ యింట్లో వుండటం మతనికి చాలా ఇబ్బంది కలిగించింది. అందుకనే దూరంగా పట్నములో వుద్యోగం వచ్చేసరికి ఎగిరి గంతేసి చక్కాపోయాడు. ఫరవాలేదు. వృద్ధిలోకి వస్తాడని శేషమ్మగారు కూడా వూరుకుంది. అక్కడ తను వూహించిన పద్ధతిలోనే జీవితం గడుపుతున్నాడని వూహించుకుని సంతుష్టి చెందింది. ఇంతవరకు అన్నీ సవ్యంగానే వున్నాయి. ఆవిడ కన్నివైపులా ఆనందమే కనబడింది.

అటువంటి ఆవిడ ప్రశాంతజీవితంలోకి వో రాయిపడి చిన్న అలలు లేవదీసింది. పట్నంలో వున్నవాడు వున్నట్లుండక శ్రీనివాసులు కథలు వ్రాయడం మొదలుపెట్టాడు. అవి ప్రచురించబడ్డాయి. చాలామంది వాటిని మెచ్చుకున్నారు కూడానూ! అటువంటి కథ వొకదాన్నావిడ చదివింది. వాటిని మెచ్చుకున్నవాళ్ళతో ఏకీభవించలేకపోయిందావిడ. "ఆ దిక్కుమాలిన పట్నంలో జేరి మావాడు పాడయిపోతున్నాడమ్మా" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది. వాడు కథలు వ్రాస్తున్నాడని కాదు ఆవిడ పరితాపం. ఆవిడ చాలాకథలూ, నవలలూ చదివింది. వాటిపై వొక విధమయిన అభిప్రాయం ఏర్పరుచుకుంది. దేవుడూ, దెయ్యాలూ వచ్చే కథలంటే ఆవిడకు చాలా ఇష్టం. విధి బలీయమైనదని ఆవిడ విశ్వాసం. దానికి వ్యతిరేకంగా ఎవరు కథలు వ్రాసినా, ఆ వ్రాసినవాడి వంటి కింత ఆవకాయ మర్దనా చేయాలనిపిస్తుందావిడకి. అటువంటిది శ్రీనివాసులు మిగతా వాఙ్మయాలన్నిటినీ వదిలి డిటెక్టివ్ కథలు వ్రాయడం మహాపరాధంగా కనిపించింది. అందులో,

"సేట్ పన్నాలాల్ తినతోటలో తిరుగుతూంటే, వొక చెట్టుమీదనుంచి ఎవడో ముసుగు మనిషి, 'హాండ్సప్, చేతులెత్తు' అంటూ తుపాకి ఝళిపిస్తూ క్రిందకి వురికి—

'శివశివా, ఇదేం కథయ్యా బాబూ' అంటూ తలమీద మొత్తుకుందావిడ. అథమం ఒక అమ్మాయీ, అబ్బాయీ, ఇద్దరూ ఏ చెట్టు క్రిందో ప్రేమించుకుని చివరకే పండిట్లోనైనా పెళ్ళిచేసుకునే కథలయినా ఆవిడ అంత బాధపడేది కాదు. కాస్సేపు బాధపడి, అప్పుడు కర్తవ్యం ఆలోచన చేసింది. "లాభంలేదు. దీనికి తగిన చర్య తీసుకోవాలి. ఆ పట్నంలో వుండి వెధవాలోచనలన్నీ బుర్రలోకి ఎక్కించుకుంటున్నాడు." అనుకుని వెంటనే శ్రీనివాస్ కో వుత్తరం వ్రాసేసింది; వాడికి కనుక తనమీద ఏమాత్రం గౌరవంవున్నా ఏడాదికి నెల రోజులు శెలవుపెట్టి తనదగ్గిర వుండాలని. వాడు పట్టణంలో పదకొండు నెలలలో పట్టించుకున్న మురికినంతటినీ, ఒక్క నెలలో తాను శుభ్రంగా కడిగివేయకలదని ఆవిడ నమ్మకం. పినతల్లిదగ్గర నెల్లాళ్ళపాటు వుండటమంటే శ్రీనివాసులికి ప్రాణసంకటమనిపించేవిషయం కాదు. కానయితే, దానికిబదులు ఇంకోటేం చేయమన్నా సంతోషంతో అంగీకరిస్తాడు. ఆవిడ వుత్తరం చూసి ఇంకోలాగ చేయడానికతను సాహసించలేదు. పదెకరాలు బంగారం పండే భూమి, పల్లెటూరు, పట్నంగాని వూళ్లో డాబాఇల్లు పదో పదిహేను వేలో రొఖ్ఖం వున్నవాళ్ళకయితే 'వోస్, ఇంతేనా?' అనిపించవచ్చుకాని లేనివాళ్లికదే పెన్నిధి.

నెల్లాళ్లు శెలవుపెట్టి ఇంటికి వచ్చిన శ్రీనివాసరావుని చూసి ఆవిడ చాలా సంతోషించింది, కుర్రవాడు బుద్ధిమంతుడు చెప్పిన మాట వింటాడని. కాని వచ్చిన నాలుగో రోజునే అతను కూర్చుని అతి సీరియస్ గా వ్రాసేస్తోంటే ఆవిడకి అనుమానం వేసింది.

"ఏమిట్రా చెవలాయి వ్రాసేస్తున్నావు, ఆ దరిద్రపు కథలేనా?"

"అబ్బెబ్బే, ఏంలేదు పిన్నీ, ఏదో వూరికే వ్రాస్తున్నా."

"ఏడిశావులే, ఏది చూడనియ్యి" అని ఆ కాగితాలు లాక్కుంది.

'డిటెక్టివ్ సతీశచంద్రుడు తన గదిలో కూర్చుని వ్రాసేస్తున్నాడు. రఘువీరలాల్ హత్యకి సంబంధించిన విషయాలన్నీ తనకి దొరికిన ఋజువులతో సహితంగా, హంతకుడెవరయివుంటాడో వ్రాసేస్తున్నాడు. ఇంతలో హఠాత్తుగా లైట్లారిపోయాయి. అతని తలపై బలంగా దెబ్బపడింది –'

శేషమ్మగారు తన బుర్రెవరో పగలకొట్టినంత ఖంగారుపడి కెవ్వున కేక వేసింది. ఈ డిటెక్టివ్ కథలలోవున్న అవస్థే అది. అది చదువుతూంటే రక్తం కరుడుకట్టుకుపోతుంది! నరాలన్నీ బిగపట్టుకుపోతాయి!! తాను నాలుగురోజులనుండి నూరిపోసినదంతా కారగాకుండాపోయిందే అని ఆవిడ బాధపడిపోయింది.

"ఛీ, ఛీ, ఛీ, ఏం పాడురోజులొచ్చేయే తల్లీ! అయినా, ఇవేం వ్రాతలురా? ఒక దేవుడూ లేదు, దెయ్యంలేదు, మరీ పేట్రేగిపోతున్నావ్?" అంటూ గావుకేకలు పెట్టిందావిడ. తాను నించున్నచోట భూమి కుంగిపోతోందనిపించిందతనికి.

"నాకు లొంగటంలేదు నువ్వు. నీ కెవతెనో తెచ్చి కట్టబెట్టేస్తే నీరోగం చప్పగా అదే కుదురుస్తుంది."

శ్రీనివాసరావు మొదటినుండి ఈ విషయమయే భయపడుతున్నాడు. ఏనాడమాంతంగా ఆవిడ తనకి పెళ్లిచేసేస్తానని బెదిరిస్తుందోనని, ఆ ప్రసంగం రాకుండా జాగ్రత్తపడుతూ వచ్చాడు. ఇప్పుడు ఏటంబాంబులాగ పేలేసిందావిడ. ఇక ఆవిడ నాపడం ఆ బ్రహ్మతరంకాదు. అప్పుడే శ్రీనివాసరావు చెవుల్లో సన్నాయి మేళం వినిపించేసి, అతని కాళ్లు దడదడలాడిపోయాయి. ఆవిడ ఎందుకు అంత అగ్గిభరాటా అయిపోయిందో ఎంతాలోచించినా అర్థంకాలేదతనికి. తాను సిగరెట్లు కాలుస్తాడా? ఉహూఁ. పోనీ తాగుతాడా? అబ్బే - పేక ఇంకోనోమహా? హతోస్మి. అమడదూరంలో ఆడదాన్ని చూసి, అటకెక్కి కూర్చునే తను, డబ్బు ఇచ్చుకుని— హరి, హరీ. పోనీ డబ్బుకోసం ఆవిడని పీడిస్తున్నాడా? అది లేదు. తనలో ఇటువంటి దుర్గుణం వొక్కటీలేదు. అయినా ఆవిడ తను పాడయిపోయాడంటోంది. దీనికి కారణం తను వ్రాసే కథలేమోనని అనుమానం వచ్చిందతనికి. గబగబా పిన్నిదగ్గరకి పరిగెత్తి అడిగాడు.

"పోనీలే పిన్నీ, నీ కిష్టంలేకపోతే యీ కథలు మానేస్తాను. ఎలాంటివి వ్రాయమంటావో చెప్పు. దేవుడిమీది కథలు ఇప్పటి వాళ్లు చదవరు."

"ఆ ప్రేమ గురించేనా ఏదో. అంతే కాని అర్ధరాత్రి అమాంతంగా పనిలేనట్లు బుర్రలు పగలగొట్టుకోడం ఏమీ బాగు లేదు."

"సరే - అయితే, అలాగే వ్రాస్తాను చూడు" అంటూ వెనకటి కాగితాలు చింపేసి తిరిగి ప్రారంభించాడు.

"డిటెక్టివ్ సతీశచంద్రుడు తన గదిలో పడక కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు, రఘువీరలాల్ హత్యని గురించి, హంతకుని విషయంలో సబబు లాలోచిస్తున్నాడు. ఇంతలో బైట తలుపుమీద ఎవరో నెమ్మదిగా బరికారు. సతీశుడు రివాల్వరు తీసుకుని, నెమ్మదిగా వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగుండా వొక అందమయిన అమ్మాయి తళుక్కుమనే కళ్ళతో చటుక్కుమని చూసింది."





హా! హా! చాలా బాగుంది. పిన్ని చాలా మెచ్చుకుంటుందని సంతోషించేశాడు. ఇవతల రేపంత కాలం అతని కథ అవిఘ్నంగా సాగిపోయింది. తీరా అమ్మాయి వచ్చాక ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడు.

ఇంతలో వీధితలుపు ఎవరో కొట్టారు.

"అబ్బబ్బ, యీ ఇంట్లో కొక్క నిమిషం కూర్చుని ఆలోచించుకోడానికి వీలు లేదు కదా?" అని విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా ఎర్రగా బుర్రగా వున్న ఓ అమ్మాయి ఇతన్ని చూసి, "శేషమ్మగారు వున్నారా?" అంది.

శ్రీనివాసరావు గుండెకాయ కాస్తా గొంతుకలోకి వచ్చింది. దాని కదే రోగం. ఇటువంటి సమయాల్లో స్ప్రింగులాగ పైకి

## ఆత్రః

### బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

బ్రదుకు కడలి త్రచ్చి భయద హాలాహల
మ్మొదవగా నిరాశ నొదుగు బదుగు.
పూన్కి బాట కొసను పొలుచు పీయూషమ్ము
నిలుచు వాడె జగతి గెలుచువాడు.

ప్రణయ పాదప మనుభవ సుమమ్ములు పూచి
కష్ట సౌఖ్య ఫల యుగమ్ము పండు.
తీపి, చేదు - రెండు తీరుల ఫలములు
మెసవు వాడె తెలివి మసలువాడు.

పవ్వళించు పాన్పు భయదాహి కోరగా
దొడిగి నడచునేల ఊబి కాదు
జనుల యెదల నసుర సభ కా దమరశోభ
కనులు విడిల పీడ కలలు కరగు

ఆశ, మెను నిరాశ అను సమాంతర రేఖ
లంత మందు టెచట? ఐక్యమెచట ?
పవలు రేయి యెపుడు పవళించు నొక సెజ్జ !
వెలుగు నిరులు నెపుడు వియ్యమందు ?

ఓహో హో నిరాశ యొడి పసిబిడ్డడా !
స్వర్ణ రుచి విశిష్ట భావి పిలుచు
మ్రోగె విజయ శంఖ మ్రోగె కోర్కెలజోల
లేచిరమ్ము; హర్ష మూచికొమ్ము.

తన్ని లోక్లోకి వస్తుంది. కాస్తంత తెప్పరిల్లి, "క్షమించండి ఒక్క నిమిషం" అంటూ లోపలికి పరుగెత్తాడు, తాను సగం వ్రాసిన కథ తీసి,

"సతీశచంద్రుని గుండె గొంతుకలోకి వచ్చింది" అని వ్రాసి, ఆ కాగితాల్ని దాచేసి బయటికి వచ్చాడు. ఆ అమ్మాయి కూలివాడి చేత పెట్టె, బెడ్డింగు లోపలకి పట్టించుకుని వచ్చింది. వాటిని చూడగానే శ్రీనివాసరావుకి గుండె ఆగినంత పనయింది. యీవిడెవరో ఇక్కడ తిష్ట వేయడానికి వచ్చిందని వూహించుకున్నాడు.

"ఇప్పుడు చెప్పండి, మీ పేరేమిటో. మా పిన్ని వంటయింట్లో వుంది. ఆవిడకి కబురందిస్తాను" అన్నాడు.

"నా పేరు లత. మీరు శ్రమపడక్కర్లేదు. నేనే లోపలికి వెడతా, మీరు కొంచం దారియిస్తే.

"లత ! ఏం లత?"

"వట్టి లతే" అని నవ్విందా అమ్మాయి.

"టట్,టట్, వట్టి లతేమిటి? కల్పలతో, సువర్ణలతో, పుష్పలతో, శశిలతో—"

ఫక్కున నవ్వింది లత.

"ఛప్, నోరుముయ్యి. వెధవ వాగుడు నువ్వూను."అంటూ శేషమ్మగారు వచ్చింది. "ఏమేవ్ పిల్లా! ఎక్కడనుండి రావడం? వుత్తరం ముక్కయినా వ్రాయకూడదు టే?"

"వూరినుండే అత్తయ్యా. అనుకోకుండా బయలుదేరాను. అందుకనే వుత్తరం వ్రాయడం పడింది కాదు."

పోన్లే, అప్పుడే వరసకూడా కలిపింది, అనుకున్నాడు శ్రీనివాసులు.

"నోరేయ్ దారికడ్డుగా నిల్చుంటే అది లోపలికి ఎలా వస్తుందనుకున్నావ్? అదెవరనుకున్నావ్ ? మీ బాబయ్యకి అక్కగారికి—" ఆ తరువాతెక్కడో తాడు వదిలేశాడతను. కాని అతను వొక్క విషయం తెల్సుకున్నాడు. ఆ అమ్మాయి ఆవిడకేదో దూరబంధువు; బి. ఏ. తప్పింది. రెండు రోజులుండి వెళ్ళిపోతుంది. డిటెక్టివ్ సతీశచంద్రుడిలా, తన బుర్రకూడా ఎవరయినా కీర్తన పాడించేస్తే బాగుండుననుకున్నాడు. వొక్క పిన్నితోటే వేగలేకపోతున్నాడు. ఆడజాతికి చెందిన మరొక శాల్తీ ఆవిడకి తోడువచ్చింది, జాగ్రతో, జాగ్రతి అనుకున్నాడు. ఆ అమ్మాయి అలా గృహప్రవేశం చేయడం అతనికేం నచ్చలేదు. ఇదేదో కొంప ములగడానికే వచ్చిందనుకున్నాడు. అతని భయాలుకూడా కేవలం ఆధార రహితాలు కావు. శేషమ్మగారు వాడి వివాహ విషయమై ప్రస్తావించిన రోజునే ఈమె రావడం కేవలం దైవికం. విధి బలీయమైనది. వీళ్ళిద్దరికీ ముడిపెట్టేస్తే సరిపోతుందనుకుంది శేషమ్మగారు. యీ ఆలోచన ఆవిడకి చాలా ఆనందం కలిగించింది. ఆవిడ ఆ మాట పైకంటే చాలు, అక్షరాలా జరపడానికి అంతా సిద్ధమే. అయినా శీనిగాడికేం లోపం? బి. ఏ. ఆనర్సు మూడేళ్ళు చదివి, చివరికి రికమెండెడ్ బి. ఏ. పట్టా పుచ్చుకున్నాడు. అయితేనేం శుభ్రంగా ఉద్యోగం చేస్తున్నాడు. పైగా తమ ఆస్తి మద్దతుంది. అన్నీ బాగానే వున్నాయి కాని, ఆవిడ దేశయాటన ఫలితంగా కొద్దిగా సంస్కారం సంపాదించింది. వీళ్లిద్దరూ, తన ప్రోద్బలం లేకుండా వాళ్లంతట వాళ్ళిష్టపడితే బాగుంటుందనుకుందావిడ. కాని, అది అలా రెండురోజుల్లో వెళ్ళిపోతుందే?

ఏదీకూడా దైవికంగా జరుగుతుందంటే శ్రీనివాసరావంగీకరించడు. అతని కథలోలాగే ప్రతిదానికీ ముందు బ్రహ్మాండమయిన ప్లాను అవసరం. కాని ఇప్పుడు జరిగిందేమిటి ? శేషమ్మగారు అతని వివాహం గురించి—విసుగులో నయితేనేం — అలా ప్రసంగం తెచ్చిందో లేదో, ఆవిడ కన్ని విధాలా నచ్చిన పిల్ల, పిలిచినట్లు వచ్చి ముందర వాలింది. పోనీ, వచ్చినపిల్ల రెండు

# ★ దత్తుడు ★

రోజు లుండిపోతే ఆ తరువాత శేషమ్మగారి సెలాగో మభ్యపెట్టేసి నెల్లాళ్ళో గడిపేస్తే తిరిగి ఏడాదివరకూ ప్రమాదం లేదనుకున్నాడు. కాని విధి ఈ విషయంలోకూడా మొండివేలు పెట్టింది. రెండు రోజులుండి వెళ్ళిపోవలసిన పిల్లకదా అని ఔత్సుక్యం, శేషమ్మగారితో కలిసి పనులు చేయబోయి నూతి దగ్గర కాలుజారి క్రిందపడింది. కాలు మడతపడి వాచిపోయింది. దాంతో మంచ మెక్కిందామె. ఆమెకు మందులు తీసికుని రావడం అదీ శ్రీనివాసులే చేయవలసి వచ్చింది. చివరికావిడ కాలుకి కట్టుకూడా అతనే కట్టవలసివచ్చింది. లత మీద పళ్లు పటపట కొరుకుతూనే కట్టుకట్టాడు. కాని ఆ అమ్మాయిమీద అభిమానంతోటే ఇవన్నీ చేస్తున్నాడనుకుంది శేషమ్మగారు. "వెర్రి నాయనా, బెంబేలుపడకు. కాలు త్వరగానే నయమవుతుందని చెప్పాడుగా డాక్టరు" అని వొకనాడతన్ని పిలిచి ధైర్యం చెప్పబోయిందావిడ. "ఏమిటీ! ఆ కాలు త్వరగా నయమవుతుందని చెప్పాడూ ఆ డాక్టరు!" అని ఖంగారుపడుతూ ప్రశ్నించాడు. ఆ ప్రశ్నలోని ఆత్రుతని పసిగట్టి, చిరునవ్వు నవ్వుతూ అందావిడ.

"త్వరగా కాలునయమవుతే అది త్వరగా వెళ్లిపోతుందని భయపడుతున్నావా? నే నంతతొందరగా దాన్ని పంపుతాననుకున్నావా?"

దాంతో శ్రీనివాసరావు ముఖం కందగడ్డలా అయిపోయింది. దానికే వేరే అర్థం తీసిందావిడ. ఆ తరువాత రెండుమూడు రోజులకి ఇల్లంతా నెమ్మదిగా తిరగడం ప్రారంభించింది లత.

శ్రీనివాసరావు స్వతహాగా బద్ధకస్తుడు. తాతలనాటి నరసరావుపేట కుర్చీలో సావకాశంగాకూర్చుని, ఇంటిచూరుకేసి చూస్తూ, తను సృష్టించిన డిటెక్టివులసాహసకృత్యాలు తలుచుకుంటూవుండడం సరదా. ఒకరోజున రెండోడోసు కాఫీకూడా త్రాగి అభిమానపు పోజులోకూర్చుని వోడ్‌హౌసు సాహిత్యం చదువుతున్నాడు. ఇంతలో 'ఏమండీ' అంటూ స్త్రీకంఠ మెదో వినబడింది. ఎవరోలే అనుకుని వూరుకున్నాడు.

'మిమ్మల్నేనండి' అంటూ లత ముందుకి వచ్చింది.

"ఎవర్నీ? నన్నా?" అంటూ వీధిగుమ్మం కేసి ఆశగా చూశాడు. అవకాశంవుంటే ఆద్వారంలోంచి హాప్ స్టెప్ అండ్ జంప్ చేసి అక్కడనుండి పదివేల మీటర్ల పరుగు తీయడానికికూడా సిద్ధంగావున్నట్లు కనబడ్డాడు. అతనలా బల్లమీద కాళ్లు పెట్టుగుని కూర్చోవడం శేషమ్మగారి కెంతమాత్రమూ ఇష్టంలేదు. ఈవిడికూడా అదేబాపతేమోనని ఖంగారుపడ్డాడు.

"అవును మిమ్మల్నే. ఆవిడ పాపం పెద్దదయింది. ఒకర్తీ ఎన్నిటికని తంటాలుపడుతుంది? కొంచం బజారుకుపోయి ఆ నాలుగు సరుకులూ మీరే తేరాదూ?" అంటూ నాలుగు సంచు లక్కడ పడేసి లోపలికి చక్కాపోయింది.

హూత్, కట్టుకున్న మొగుడుమీద చలాయిస్తూన్నట్లు అధికారం చెలాయిస్తోందే!" అనుకున్నాడు. శేషమ్మగారు లత చెవిలో యీవార్త ఇంకా వేయలేదని అతనికి తెలియదు. కాని, ఎదురుగుండా సంచులు 'తప్పదు, తమ్ముడూ' అన్నాయి. వోడ్‌హౌసుకేసి జాలిగా చూస్తూ రోడ్డుమీద పడ్డాడు. అతని బుర్రలో జెట్ విమానాలు పరుగెట్టాయి. తన జీవితవిధానంలో ఏదో పెద్దపరిణామం వచ్చేస్తోందని భయపడ్డాడు. తన పినతల్లి, లత, ఇద్దరూ కలసి ప్రేమ పేరుతో లేనిపోని బాధ్యతలు తన నెత్తిపై రుద్ది తనని త్రాళ్ళతో బంధించేద్దామనుకుంటున్నారు. ఆ లతని కనుక తను పెళ్ళాడితే - హాతోస్మి, హాతోస్మి, ఆవిడతో సంసారం వూహించుకోడానికి కూడా దుర్భరంగావుంది. రోజూ తన పిన్నిలాగే ఆరుగంటలకల్లా లేపేస్తుంది. అంతటితో వూరుకోదు, 'ననవా నోయ్' అని సంగీతంకూడా ప్రారంభిస్తుంది. జీవితకాలమంతా వీటిని భరించడ మెలాగురా భగవాన్లూ అనుకుంటూ గాభరాపడిపోయాడు. అంతటితో వూరుకుంటుందా? ఉహూఁ రోజూ గడ్డం గీయకపోతే తిండి పెట్టదు. రోజూ యీ గడ్డం చేసుగోడ మతనికో పెద్దసమస్య. ఇదంతా వట్టి టైమ్ వేస్టు. నిజాని కతనికి అంతకంటె కొంపలు ములిగే పనులూ లేవు. అతని కిదంతా బద్ధకం. తన పినతల్లి తనలో చూచిన చెడ్డ అలవాటు ఇదేనని అతను తెలుసుగోలేకపోయాడు. సంచులన్నీ నింపుగుని ఇంటిదారి పట్టాడు. దార్లో సినిమా బండేదో అట్టహాసంగా వెడుతోంది. ఛా, వెధవ సినిమాలు. మనుష్యుల కాలం వృధా చేసి, పర్సు కాళీ చేసేయడానికి. కొంప తీసి వారానికి అధమం రెండు సినిమాల కయినా లాక్కుని వెడుతుందేమో ఆవిడ. అతనికి వెన్నెముకలో జెర్రి ప్రాకినట్లయింది. 'శ్రీనివాసూ, ఇంక నీపని అఖర్. గుడ్ బై' అనుకున్నాడు. కాని వెంటనే తమాయించుకుని, "టట్. వీళ్ళంటే నే నెందుకు భయపడాలి? వాళ్లు చెప్పినట్లల్లా చెయ్యాలనివుందా?" కాని యీ వాదన వ్యర్థమని వెంటనే బోధపడింది. 'ఛస్, లాభం లేదు.' ఇతరు లేదైనా అంటే అవుననడం తప్ప, కాదని వాదులాడటం చేతకాదు.

అయినా ఎంతకాలం 'కంయ్, కంయ్'మంటూ కొట్లాడుకుంటారు? ఇలాంటి ఆలోచనలన్నీ మనసుని పాడుచేసేస్తోంటే, కాళ్ళీడ్చుకుంటూ ఇల్లుజేరాడు. గుమ్మం దగ్గిరే ఎదురయింది శేషమ్మగారు చింకి చేటంత ముఖం వేసుకుని, "నే చెప్పలేదురా? నీరోగం కుదర్చాలంటే తగినది లతే."

"అవునట" అంటూ లోపలికిపోయాడు. అందులోని వ్యంగ్యం ఆవిడకి అర్థంకాలేదు.

"ఒరేయ్, అవుసరమయితే నీ శలవు పదిహేనురోజులు పొడిగించాల్సొంటుంది. ఈ శలవుల్లోనే నీ పెళ్ళి కాస్తా అయిపోతే-"

"అలా ఇవ్వరు శలవు పిన్నీ."

"ఎందు కివ్వరూ? నాకు రూల్సు నేర్పుతా వేమిటి? మీ బాబయ్య—"

"ఇస్తారులే. కాని అవుసరమా అని."

"ఓర్నీ. అంతకంటె తొందరగా అవాలంటే, అవతల వాళ్లు ఏర్పాట్లు చేసుగోడానికి టయిము వుండాలా?"

తనన్న ప్రతిమాటా ఆవిడ ఇంకోలా ఎందు కర్థం చేసుగుంటుందో అతని కర్థం కాలేదు. ఇంతలో మెరుపులాంటి ఆలోచనొకటి అతనికి తట్టింది.

"కొంపతీసి ఆ అమ్మాయి కీసంబంధ మిష్టంలేదేమో. నువ్వు వూరకే తొందరపడిపోతున్నావు."

"ఎందు కిష్టంలేదూ? నిక్షేపంలా ఇష్టముంది. ఇంతకీ నీకేంలోటు? వాళ్ళనాన్నకి నిన్ననే వుత్తరం వ్రాశాను. ఈవాళో రేపో రెక్కలుకట్టుగుని ఇక్కడ వాలడూ?"

(49 వ పేజీ చూడండి)

## ఉదయ కిరణాలు

### సవరణ

ఈ వారం సంచికలో "ఉదయ కిరణాలు" సీరియల్ ముద్రణలో ఒక పొరపాటును గమనించవలెనని పాఠకులను కోరుతున్నాము. 17 వ పేజీ మొదటి కాలం రెండవ పేరాలో "అలవాటు ప్రకారం చిట్టిబాబు, ప్రకాశం సోమయాజులు ఇంట్లో భోంచేస్తున్నారు" అనే వాక్యం తరువాత 18 వ పేజీ ఆఖరు పేరాలో "ప్రకాశం ఆ యేడు కాలేజీ ఎన్నికలలో..." అనే వాక్యం మొదలు 19 వ పేజీ ఆఖరువరకూ చదువుకోవలెను. ఆపైన 17 వ పేజీ మొదటి కాలం మూడవ పేరా మొదలు 18 వ పేజీ మూడవ కాలం ఆఖరు పేరాలో "పూర్ణయ్యగారి నిర్మల వదనం చూడగానే......" వరకూ చదువుకోవలెను. దానికి తరువాయి 20, 21 పేజీలు.

సీరియల్

# ఉదయ కిరణాలు

పోతుకూచి సాంబశివరావు

## 11

పరీక్షలవగానే చిట్టిబాబును వెంటబెట్టుకుని ప్రకాశం విజయనగరం వెళ్ళాడు. గంపెడు జబ్బుపడి లేచి పరీక్షలకు కూడా కూర్చుని వచ్చిన ప్రకాశంమీద అవధానికి అభిమానం పెల్లుబికి వచ్చింది. మాణిక్యం తన కొడుకు బ్రతికి బట్టకట్టాడని రాగానే గారాబుగా దగ్గరకు తీసుకుని ఒళ్ళు నిమిరి కుశలప్రశ్నలడిగింది. జబ్బులో కొడుక్కి చిట్టిబాబు, రావమ్మ, జాగ్రత్తగా సేవచేశారని వాళ్లను ఎంతో ప్రశంసించింది.

బంగళా ఎదురుగాఉన్న మఱ్ఱిచెట్ల చల్లగాలిలో అసలు వేసవికాలం కనిపించనే లేదు చిట్టిబాబుకి. ప్రకాశం, సాంబు, శాంతలతో ఆడుతూ పాడుతూ కాలం ఒక నిమిషంలా గడిపేస్తున్నారు. పేకాటలు - చెడుగుడి - బాడ్మింటన్ - సినీమాలు - వీటితో ఊపిరి తిరగటంలేదు కుర్రాళ్లకు. అవధాని తనకు సెలవుదొరికినప్పుడు కుర్రాళ్లను వెంటబెట్టుకుని చుట్టుప్రక్కల పల్లెటూళ్లకు పిక్నిక్ తీసుకెళ్లేవాడు. అవధాని మామయ్య తిమతో చాలా సరదాగా గడపడం చిట్టిబాబుకు ఎంతో ఆనందమయింది.

ఒకరోజు మధ్యాహ్నం భోజనాలు సుష్టుగాచేసి, చిట్టిబాబు ప్రకాశం కాళ్లు చాపుకుని పడుకున్నారు. సాంబు, ప్రక్కయింటి బెంగాలీ కుర్రాడిని వెంటబెట్టుకుని మిట్ట మధ్యాహ్నపు ఎండలో, పండువెన్నెలన్నట్లు, పచార్లు చెయ్యసాగాడు. రోడ్డుమీద పోతూంటే ఒకాయన తదేకధ్యానంతో పేపరు చదువుతున్నాడు. పేపరు వెనకాల ఏవో అంకెలు జోరుగా కనిపించాయి సాంబుకు. తక్షణం ఆగిపోయాడు.

'ఏమండీ! స్కూలుఫైనలు పరీక్షల ఫలితాలు పడ్డాయా!' అడిగాడు సాంబు.

ఆ పెద్దమనిషి సాంబుకేసి తమాషాగా నవ్వుతూ చూశాడు.

'పడ్డాయండి' అంటూ చమత్కారంగా నవ్వాడు ఆ పెద్దమనిషి.

సాంబుకు ఉత్సాహం ఆగలేదు. ఆ బెంగాలీ కుర్రాణ్ణి కూడా జలవంతపెట్టి, ఒక్క పరుగులో ఇంట్లోకి ఉరికాడు. ప్రకాశం గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

'ఒరే అన్నయ్యా! నీ పరీక్ష ఫలితాలు వచ్చాయిరోయ్' ఒక్క కుదుపుతో ప్రకాశాన్ని లేపేశాడు సాంబు.

ప్రకాశం కళ్లు నులుముకుంటూ లేచి కూర్చున్నాడు. పరీక్ష ఫలితాలు వచ్చాయని వినగానే ఒక్క గెంతుగెంతి, చిట్టిబాబును లేపాడు. ముఖాలు కడుక్కుని వదులుగాఉన్న పంట్లాములు బిగించుకుంటూ వీధిలోకి పరుగెత్తారు యిద్దరూ.

'టీ కంపెనీలో అవధాని మామయ్యదగ్గర వార్తాపత్రిక దొరుకుతుందని, ఆవైపు నడక సాగించారు కంగారుగా, ఆత్రుతతో.

వార్తాపత్రిక చూసిన అవధాని సంతోషంతో దాన్ని మడత పెట్టి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఒగర్చుకుంటూ ఆఫీసులోకి వచ్చిన ప్రకాశాన్ని, చిట్టిబాబును చిఱునవ్వుతో ఒక్కసారి తిలకించాడు అవధాని.

'ఏమ్రా! యిల్లా వచ్చారు?' వాళ్ళు వచ్చిన కారణం తెలియనట్లు నటించాడు అవధాని.

'పరీక్ష ఫలితాలు వచ్చాయట. పేపరు కావాలి' అన్నాడు చిట్టిబాబు.

'అలాగా' అని చిఱునవ్వుతో వార్తాపత్రిక అందిచ్చాడు అవధాని.

అవధాని చిఱునవ్వు చూడగానే అర్థం చేసుకున్నాడు ప్రకాశం తమ ఫలితాల సంగతి చిట్టిబాబు వార్తాపత్రికచూసి సంతోషంతో పెద్దకేక పెట్టాడు.

'ఒరేయి టీపార్టీ యివ్వాలిరోయి' అంటూ.

'ఆఁ అలాగే యిస్తా' అన్నాడు ప్రకాశం. చిట్టిబాబుకు సంతోషం ఆగక కుర్చీమీద నుంచి లేచి గంతులు వేస్తూ నుంచున్నాడు.

'ఒరేయి ఇది ఆఫీసు' అన్నాడు అవధాని.

చిట్టిబాబు తగ్గాడు.

'ఇంటికి పదండి' అన్నాడు అవధాని.

ఒక్క పరుగులో వార్తాపత్రికతో వచ్చి యింట్లోపడ్డారు ప్రకాశం, చిట్టిబాబు.

మాణిక్యం కొడుకు ఫలితం విని ఆనందంతో ఉబ్బిపోయింది. అనుకున్నప్రకారం చిట్టిబాబుకూడా ప్యాసయ్యాడు. వాళ్ల సంతోషంచూసి 'ఒరే కుర్రాళ్లు! పకోడీలు చేసి పెడతానర్రా' అంటూ పొయ్యిలో నిప్పురాజేసింది మాణిక్యం.

పొయ్యి పొగతో రాజుకుంటోంది. మాణిక్యం హృదయంలో పొగలాంటి విచారం కమ్మింది. ఇదిచూసే భాగ్యం తండ్రికి కల్గలేదని లోలోపల బాధపడి కన్నీరు పెట్టుకుంది.

కుర్రాళ్లు ఫలహారంచేస్తూంటే అవధాని వచ్చాడు. కోటు విప్పుకుని సరాసరి వంటింట్లోకి వచ్చేశాడు.

'మీవాడు పరీక్ష ప్యాసయ్యాడమ్మోయి' ఒక్క కేక విసిరాడు మాణిక్యంవైపు అవధాని.

'విన్నాను' అంది మాణిక్యం చిరునవ్వుతో.

అవధానిముందుకూడా పకోడీలు ఒక ప్లేటులో వెలిశాయి. ఒక్కటొక్కటి తీసి నములుతున్నాడు అవధాని.

'నువ్వు ఏంచదువుతావురా ఈతర్వాత?' అవధాని చిట్టిబాబువైపు చూశాడు.

'ఇంటర్ మీడియట్' అన్నాడు చిట్టిబాబు తీవిగా ముఖంపెట్టి.

'వేడి పెసరట్ కాదుగదా!' అవధాని హాస్యం చేశాడు.

పిల్లలు గొల్లుమని నవ్వారు.

'ఏరా నువ్వేం చదువుతావురా?' అవధాని ప్రకాశంవైపుచూసి ప్రశ్నించాడు.

మాణిక్యం చిట్టిబాబు చూశారు ప్రకాశంవైపు. తను పరులమీద ఆధారపడి బ్రతుకుతున్న విషయం గుర్తించుకున్న ప్రకాశం ఏసమాధానం చెప్పాలా అని సందిగ్ధంలో పడ్డాడు అవధాని వేసినప్రశ్నలో తన ముందు చదువులకు ఆస్కారంకూడాఉందని తెలుసుకుని ఆశ్చర్యపోయాడు.

'నీయిష్టం' అన్నాడు ప్రకాశం తలదించుకుని.

"నేనుకాదుగా చదువుకునేవాణ్ణి" అన్నాడు అవధాని.

ప్రకాశం మౌనం వహించాడు, ఇంకేమనాలో తెలియక.

'నాయిష్టమైతే చదువు మానెయ్యమంటాను' అన్నాడు అవధాని, మాణిక్యం ప్రకాశంలవైపు చూస్తూ.

ఇద్దరూ అవధానివైపు దీనంగా చూశారు.

'అదేమిటి మామయ్యా! అలా అంటావు!' అన్నాడు చిట్టిబాబు.

 ## ఉదయ కిరణాలు 

'అవునురా! కాలేజీ చదువుకు డబ్బు ఎంత ఖర్చవుతుందో తెలుసా? డబ్బేదీ?' అన్నాడు అవధాని.

'పోనీలే! మా అమ్మతో చెప్పి చదివిస్తాను వాణ్ణి!' అన్నాడు చిట్టిబాబు.

'మీ అమ్మదగ్గర డబ్బు మాటలతో పడుంది!' అన్నాడు అవధాని ముఖం చిట్లించి.

అందరిమధ్యా ఒక్కసారి నిశ్శబ్దం అలుముకుంది. ప్రకాశం దిగాలుగా పకోడీలు నములుతున్నాడు. మాణిక్యం తల దించుకుంది. తమ అదృష్టం ఇంతే అనుకుంటూ. ఇది గమనించిన అవధాని నవ్వేశాడు.

"లెండ్రా! సినిమాకి వెడదాం కుర్రాళ్ళూ!" అంటూ లేచాడు.

ప్రకాశం, చిట్టిబాబు ముఖాలలో ఆనందం తేలియాడింది. కాని ప్రకాశానికి దిగులు పోనట్లు కనిపించింది అవధానికి.

'ఒరే. ఉషారుగా ఉండరా!' అంటూ అవధాని ప్రకాశానికి హెచ్చరిక చేశాడు.

అవధాని ప్రవర్తన గమనించిన మాణిక్యానికి కొడుకు ముందు చదువును గురించి కొంత ఆశ లేకపోలేదు. ప్రకాశం మాత్రం అవధానిని పూర్తిగా అర్థంచేసుకోలేక పైకి మామూలుగా ధైర్యంగా మసులుతున్నా, లోపల ముందు చదువు వుండదనే బెంగ మాత్రం పోగొట్టుకోలేకపోయాడు.

'అవధాని మామయ్య చెప్పించలేక పోయినా, ఎప్పటికైనా బి. ఏ. చదివి తీరతాను.' అని నిశ్చయించుకున్నాడు ప్రకాశం.

రెండురోజుల్లో రాధమ్మ ఉత్తరం వ్రాసింది. పరీక్ష ఫలితాలు చూసి చాలా సంతోషించానని చిట్టిబాబును త్వరలో కాకినాడ పంపమని, ప్రకాశం ముందు చదువుల గురించి ఏమి నిశ్చయించారో తెలియపరచమని వ్రాసింది.

అవధాని ప్రకాశం ముందు చదువుల గురించి ఏం చేద్దామా అని ఆలోచించసాగాడు. ప్రకాశం చురుకైనవాడు. వాడికి తప్పకుండా స్కాలర్‌షిప్ దొరుకవచ్చునుకున్నాడు అవధాని. ఇప్పటికి తన జీతంలో కుటుంబాన్ని పోషించడం కొంచెం యిరకాటమౌతోంది. ప్రకాశానికి చదువు ఖర్చులు భరించడమంటే మరీ చిక్కుపడవలసి వస్తుంది. బి. ఏ. చెప్పించాలంటే నాల్గు సంవత్సరాలింకా మాణిక్యం కుటుంబాన్ని పోషించాలి. సాంబుచదువు, కాంత పెళ్ళి ఖర్చులు ముందు ఉండనేవున్నాయి. అయినా ఎల్లాగైనా ప్రకాశానికి చదువు చెప్పిద్దామనుకున్నాడు అవధాని.

'నీ ఉద్దేశం ఏమిటి?' అవధాని మాణిక్యాన్ని అడిగాడు.

'ఈ విషయంలో నేనేం సలహా యివ్వగలను. నీ యిష్టం అంతా' అంది మాణిక్యం.

అవధానికి ఒక సందిగ్ధావస్థ వచ్చింది. బి. ఏ. చదివిద్దామా, లేక ఏదైనా టెక్నికల్ కోర్సుకు పంపిద్దామా ప్రకాశాన్ని అని. ఏమీ తోచక, అయినా కుటుంబంలోని పెద్దల సలహాలు కూడా తీసుకుందామని, సోమయాజులుకు, సర్వేశ్వర శాస్త్రికి పరంధామయ్యకు ఉత్తరాలు వ్రాశాడు అవధాని.

ప్రకాశం స్కూలు ఫైనలు పరీక్షలో ఉత్తీర్ణుడైనాడని తెలిసిన బంధుజనం కళ్లలో కారాలు చల్లుకున్నారు. సీతమ్మ, సుబ్బమ్మ పగిలిన రబ్బరుబూరాల్లా మూతులు ముడుచుకున్నారు. ప్రకాశం తెలివి తేటలకు అతడి క్లాసు మేటు వెంకటశం నిర్ఘాంతపోయాడు.

ప్రకాశానికి పై చదువులు చెప్పించదల్చుకున్నానని అవధాని వ్రాసిన ఉత్తరం గోరుచుట్టుమీద రోకటిపోటులా వచ్చింది. సీతమ్మ గుండెలు కోసేసినట్లు బాధపడింది. సోమయాజులుతో హోరాహోరి యుద్ధం చేసింది ప్రకాశం చదువు ఇంక మాన్పించి ఏదైనా ఉద్యోగంలో చేర్పించమంటూ జవాబు వ్రాయమని. భార్య యుద్ధానికి తాళలేక సోమయాజులు తాత్కాలికంగా ఒప్పుకున్నా తండ్రిలేని పిల్లవాడిమీద అంత కాఠిన్యం చూపలేక పోయాడు. సీతమ్మకు తెలియకుండా అవధానికి ఉత్తరం వ్రాశాడు. అటు భార్యకు, ఇటు అవధానికి బాధ కలగకుండా బి. ఏ. చదివినందువల్ల లాభాలు, టెక్నికల్ చదువులు నేర్పినందువల్ల లాభాలు వరుసగా ఒక జాబితాలా ఏకరువుపెట్టి 'అంతా నీ యిష్టం' అంటూ ముగించాడు సోమయాజులు.

సర్వేశ్వరశాస్త్రి అవధాని ఉత్తరం చూసుకుని 'వీడు ఇంకా బాగుపడుతున్నాడా?' అనే ఆశ్చర్యంలో పడ్డాడు. చదువులవల్ల ప్రయోజనం లేదనీ, అందులో ఇంగ్లీషు చదువులవల్ల అసలు లాభం లేదని, జవాబు వ్రాశాడు.

అవధాని ఉత్తరంచూసి పరంధామయ్య చిరాకుపడ్డాడు. 'వీడికి మతిలేదులాగుంది. ఇంకా నాలుగేళ్లు ఒక కుటుంబం పోషించడం మాటలా? అంటూ తన అభిప్రాయం నిక్కచ్చిగా వ్రాసేశాడు.

'నువ్వు బాగుపడదల్చుకుంటే తక్షణం ప్రకాశం చదువు మాన్పించు. నేను వాడికి ఎక్కడో ఒకచోట కోమటి గుమాస్తా ఉద్యోగం యిప్పించగలను. నీ డబ్బు పాడు చేసుకోక, నీ ముందు అభివృద్ధి చూసుకోవల

సింది' అని ఉత్తరం నింపాడు పరంధామయ్య.

ఈ జవాబులు రాగానే అనుకున్నట్టే వ్రాశారు అనుకున్నాడు అవధాని. 'తాము ఒకళ్లకు దానం చెయ్యలేకపోయినా, చేసే వాళ్ళనిచూసి ఏడ్చేవాళ్లు ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటారు. తనకి లేదని ఏడిస్తే ఒక కన్ను ఒకళ్ళకు ఉందని ఏడిస్తే మరొక కన్ను పోతుందట' అని లోలోపల నవ్వుకున్నాడు. ప్రకాశాన్ని ఇంటరుచదివించి తర్వాత పరువుసురించి మళ్లీ ఆలోచించవచ్చని నిశ్చయించుకున్నాడు.

'ప్రకాశంగారు కాకినాడ ఎప్పుడు వెడతారు?' అవధాని ఒకరోజు భోజనాల సమయంలో ప్రకాశాన్ని హాస్యంగా ప్రశ్నించాడు.

'ఎందుకు?' అన్నాడు ప్రకాశం తనస్థితి అర్థం చేసుకున్నట్లు.

'ఎందుకేమిటి? ఇంటరుచదువుకోడానికి' అవధానివైపు ఒకసారి మౌనంగా చూసి నవ్వేశాడు ప్రకాశం.

'నట్టినాయనా' చదువు చెప్పించనని ఎల్లా అనుకున్నావురా?' ప్రకాశం హృదయంలోని బాధ అర్థం చేసుకున్నట్లు ఓదార్చాడు అవధాని.

'ఉషారుగా ఉండాలోయ్ మహారాజ్' చిట్టిబాబు సంతోషంతో ప్రకాశాన్ని తట్టి ఈల వేశాడు సరదాగా.

అవధాని పంచాంగంచూసి కుర్రాళ్ల ప్రయాణానికి ఒక ముహూర్తం నిశ్చయించాడు. ఆరోజు పెట్టె బెడ్డింగులు సర్దుకున్నారు చిట్టిబాబు, ప్రకాశం. అవధాని, సాంబుతో కుర్రాళ్లని రైలెక్కించడానికి స్టేషనుకు వెళ్ళాడు, వచ్చిన రైలు కుర్రాళ్ల నిద్దరినీ తన పెట్టెలోకి ఎత్తుకొని పరుగెత్తింది.

ప్రకాశం తప్పకుండా మంచి అభివృద్ధిలోకి వస్తాడు' అనే ఆశతో ఆనంద బాష్పాలు రాలుస్తూ, తను ఈ కుటుంబానికి చేసే త్యాగం సార్థకం కాగలదని సంతోషించాడు అవధాని.

## 12

చిట్టిబాబు, ప్రకాశం కాకినాడలో కాలేజీలో చేరారు. ప్రకాశానికి సునాయాసంగా స్కాలర్‌షిప్ దొరికింది. చితికిన ఆర్థికస్థితిలో ఇది ఒక మేలు అని రాధమ్మ, అవధాని సంతృప్తి పొందారు. ఆంజనేయమూర్తి ఇంటరుపరీక్షపై దండయాత్రలు యింకా చేస్తూనే ఉన్నాడు. కొడుకు అవస్థ, ప్రకాశం 'అదృష్టంచూసి తల్లి సుబ్బమ్మ అసూయతో చిందులు త్రొక్కుతోంది. ఎప్పటికైనా వెంకటప్పయ్య జ్యోతిషం ఫలిస్తే బాగుండునని ఆకోరిక సఫలీకృతం కావాలంటూ దేవుళ్లకు మొక్కుకుంది.

రామలింగశర్మ గారాబంతో పెరగడం చేత చదువులో అశ్రద్ధ అలవాటయింది. సోమయాజులు బడిపంతులవడంచేత రామలింగశర్మకు భయభక్తులు చెప్పలేకపోతున్నాడు. సంతానంలేని సమయంలో కష్టపడి సంపాదించుకున్న దత్తుడిని ఏ శ్రమా లేకుండా పువ్వుల్లో పెట్టి పెంచుతోంది సీతమ్మ. అందువల్ల చదువు రావటంలేదని ఎప్పుడైనా సోమయాజులు రామలింగశర్మపైన కోపపడినా సీతమ్మ అతడిని వెనుక వేసుకు వచ్చేది. తల్లి రక్షణలో శర్మ బాగా పేట్రేగిపోయాడు. బలవంతాన ఇంగ్లీషు ముక్కలు కొన్ని నేర్పి, శర్మను రెండవ ఫారంలో ఆ యేడే చేర్పించాడు సోమయాజులు. శర్మ ఈదేవున్న సాంబు విజయనగరంలో ఫోర్తుఫారం చదువుతున్నాడు. రామలింగ శర్మకు ఒకటి రెండు సంవత్సరాలు ఎక్కువైనా అందరూ అతడికన్న పెద్ద క్లాసుల్లో ఉంటున్నారని సీతమ్మకు సహజంగా కంటగింపుగానే ఉంది. కాని ఏం చేయగలదు? రామలింగశర్మను చిట్టిబాబు, ప్రకాశం, కన్న మిన్నగా ఎలా ఉంచాలా అని లక్షవిధాల ఆలోచించింది. చివరికి ఆవిడకు సరియైన ఆలోచన ఏమీ తట్టక, శర్మను అందాలరాశిలా, విలువైన బట్టలలో చుట్టి ఒక విలువైన మనిషిలా చూపించాలని నిశ్చయించుకుంది. ఇంక సోమయాజులు ప్రతి నెలా తన జీతంలో సగం సీతమ్మ చేతుల్లో గుమ్మరించవలసి వచ్చింది. దంపతులిద్దరూ' కొడుకుకోసం తమ స్వంతఖర్చులు బాగా తగ్గించుకున్నారు. రామలింగశర్మ రోజుకొక విల్కులాగు, చొక్కా తొడు

క్కాంటే, శోభనయోజులు అతుకుల ముతక లాల్చీ ఒకటి పదిహేను రోజుల కొకసారి మార్చేవాడు. సీతమ్మ మునుపటినుంచీ పెట్టెలోఉన్న సిల్కు చీరలతో కాలం గడుపుతోంది.

చిట్టిబాబు, ప్రకాశం, దుస్తుల విషయంలో రామలింగశర్మతో పోటీ చెయ్యలేరు. రాధమ్మ అందుకు విచారించలేదు. హద్దుదాటి హంగులుచేసుకుంటే తర్వాత పశ్చాత్తాపపడవలసి ఉంటుందని ఆమె నమ్మకం. ప్రకాశం తనకున్న నాలుగైదు జతలు జాగ్రత్తగా కట్టుకుంటున్నాడు. వైరాగ్యదృక్పథం అలవడిన అతడికి సిల్కు దుస్తులమీద మోజు లేనేలేదు. కాని బంధువులు, స్నేహితులు, ఎవరైనా ఈ ముగ్గురి కుర్రాళ్ళను చూసినప్పుడు రామలింగశర్మ బట్టలనాణ్యం అడిగి 'ఎంత బాగున్నాయమ్మ' అని పొగుడుతూంటే చిట్టిబాబు వెక్కిరిస్తూ 'మేడిపండుచూడ మేలిమై ఉండు' నంటూ శూనిరాగం తీసేవాడు. సీతమ్మకు రోషం వచ్చేది. కొట్లకుక్కలా రామలింగశర్మ పెంకితనంతో కలియబడేవాడు. చిట్టిబాబుకు, రామలింగశర్మకు, అందరి ఎదురుగా పెద్దకుస్తీ జరిగేది. వయసులో పెద్దవాడైన చిట్టిబాబు రామలింగశర్మను కుస్తీలో ఓడించేవాడు. శర్మ ఉడుకుమోతుతనంతో చిట్టిబాబును రక్కేవాడు. ఓడిపోయి ఏడుస్తున్న కొడుకును ఓదారుస్తూ రాధమ్మతో ఘర్షణపడేది సీతమ్మ. తాత్కాలికంగా అప్పచెల్లెళ్లు కొడుకుల విషయంలో ఘర్షణలుపడినా, బాంధవ్యాలు త్రెంచుకునేపరిస్థితులుమాత్రం రాలేదు. కాని రాధమ్మకు భయంగానే ఉండేది - రామలింగశర్మ ఏముప్పు తెస్తాడో అని.

వాతావరణం క్రొత్తదికాగానే ఎదిగే కుర్రాళ్ళ స్ఫటికాలవంటి మనస్తత్వాలు క్రొత్త కోణాలు ఏర్పరుచుకుంటాయి. కాలేజీఆవరణ ప్రకాశానికి క్రొత్తగాకనిపించింది. తనచుట్టూఉన్న విద్యార్థులలో నూత్నభావాలు కనిపించాయి. దూరపు ఊరిలో తలిదండ్రులవద్దనుంచి డబ్బు తెప్పించుకుంటూ విచ్చలవిడిగాఖర్చుపెడుతూ అదుపు ఆజ్ఞలులేక స్వేచ్ఛ కలవాటుపడిన విద్యార్థులు ఇంతవరకూ అణగిపోయి పనిచెయ్యని మెదడులోని బూజులు దులిపేయజొచ్చారు. ప్రతి విద్యార్థి తనలో ఏదో ఒక క్రొత్తదనం ఉందన్నట్లు మసలజొచ్చాడు.

కలెక్టరుగారబ్బాయి కాలేజీకి కారులో వస్తున్నాడు. జమీందారుగారబ్బాయి రెండుగుర్రాలకోచిలో కాలిమీద కాలు వేసుకుని దర్జాగా దిగుతున్నాడు. ఇస్త్రీ మడతలు నలగకుండా ముస్తాబయి షోకుగా నడుస్తూ దర్జాగా ఇంగ్లీషులో మాట్లాడుతూ అడుగులు వేస్తున్నారు చాలామంది విద్యార్థులు. ఆడవాళ్లుకూడా గాలి వాటాల్లా చీరలు విసురుకుంటూ సైకిళ్ళమీద వస్తున్నారు. నలగని సూట్లతో గంభీరమైన ముఖాలు పెట్టి, కళ్ళజోళ్ళు సర్దుకుంటూ, టకటకమని కాలిజోళ్లు శబ్దం చేసుకుంటూ, తొణకని విజ్ఞానపుకుండల్లా, మౌనంగా నడిచివచ్చేస్తున్నారు లెక్చరర్స్. హైస్కూలులోవలె ప్రశ్నలు అడగకుండా, ప్రతీ మాష్టరు ఒక గంట పెద్ద ఉపన్యాసమిచ్చేసి తన పని పూర్తయిందని సంతృప్తితో బయటికి పోతున్నాడు. వచ్చిన మాష్టారు అమాయకుడైతే కొంతమంది విద్యార్థులు పిల్లికూతలు, కేకలు, ఈలలు, అనవసర ప్రశ్నలు వేస్తూ, ఆయన్ని వ్యథ పెట్టుతున్నారు. మరికొందరు చెప్పే పాఠాలవైపు చెవులుంచినా, దృష్టి అంతా క్లాసులోని విద్యార్థినులవైపు కేంద్రీకరిస్తున్నారు.

రెండు అంతస్థుల పెద్దబంగాళా - దాన్ని ఆవరించుకున్న పెద్దమామిడితోట - పచ్చగడ్డి మైదానాలు - లావుపాటి బైండు పుస్తకాలతో నిండిన పెద్ద అద్దాల బీరువాల లైబ్రరీ - విచిత్ర తత్వాల విద్యార్థి సమూహాలు...పువ్వులు రాలినట్లు మైదానంలో తిరిగే విద్యార్థినులు - విద్యార్థి సంఘం ఎన్నికలు - ఎన్నికలలో ఉత్సాహంతో ఉద్రేకంతో ఉపన్యాసాలిచ్చేవాళ్లు - ఆటలు - నాటకాలు - విషయచర్చలు - పోటీలు—ఇవన్నీ చూస్తున్నకొద్దీ ప్రకాశానికి తాను తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో వున్నాయనే భావన, నూత్న చైతన్యమూ కలిగాయి. కాలేజీలో ప్రతీ కార్యక్రమంలోనూ తనుకూడా పాల్గొనాలనిపించింది. మామూలుగా సముద్రపు ఒడ్డుకు షికారు వెళ్లిన మనిషి, మహోదధి గంభీరఘోషని, అందులోని అగాధాలు కొలుస్తూ విస్తుపోయి నుంచున్నట్లు ప్రకాశం తనముందు కనిపించే విజ్ఞానసముద్రాన్ని ఏవిధంగా ఈదాలి అనే ఊహాలోపడ్డాడు.

పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకోడమే గొప్ప విషయం కాదు. జీవితానికి, చదువులకు ఎంతో వ్యత్యాసముంది. చదువులవల్లే పూర్తి విజ్ఞానం వస్తుందనుకోడం పొరపాటు. విజ్ఞాన సంపాదన జీవితంలో ఒక లక్ష్యంగా నిర్ణయించుకోవాలి. లక్ష్యసిద్ధి కావాలంటే జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు ఎదుర్కోవాలి అనే సిద్ధాంతం మెల్లిగా జీర్ణించుకున్నాడు ప్రకాశం.

పరిసరాలు జాగ్రత్తగా అర్థం చేసుకుంటూ మొదటి సంవత్సరం కాలేజీలో గడిపేశాడు, ఏతం తోడుతో చేద బైటికి వచ్చినట్లు. ప్రకాశం స్నేహంతో చిట్టిబాబు కూడా మొదటి సంవత్సరం పూర్తి చేశాడు. రెండవ సంవత్సరం కాలేజీలో ప్రతీ కార్యక్రమంలోనూ పాల్గొని తన తెలివి ప్రదర్శించాలనే ఉద్విగ్నతతో ఉత్సాహం చేకూర్చుకున్నాడు ప్రకాశం. ఆటలలో, నాటకాలలో, ఉపన్యాసపు పోటీలలో - వ్యాసరచనల్లో అన్ని బహుమతులూ తాను పొందుతున్నట్లు - విద్యార్థి స్నేహితులు తను ప్రశంసిస్తున్నట్లు ఎన్నో కలలు కన్నాడు.

సూర్యకిరణాలు సోకని నీడలోని మొక్కలా ప్రకాశం ఆశలు చిగురించి వృద్ధి కావడానికి అవకాశాలుపోయి జీవితంలో ఆటంక, అంతరాయాలు కలిగాయి, అనుకోకుండా. ప్రత్యేకమైన బాధ్యతలు లేకుండా, రాధమ్మ యింట్లో భోంచేస్తూ, ఒంటరిగా హాయిగా బ్రతుకుతున్న ప్రకాశాన్ని

సంసార బాధ్యతలు - తదితర వ్యాపకాలు కాలం- చుట్టుముట్టేశాయి.

ఇలా జరుగుతుందని ఎప్పుడూ అనుకోలేదు ప్రకాశం. జీవితంలోని ఆశలు, ఆశయాలు అనుకున్న ప్రకారం వివిధంగానూ సఫలీకృతం కావని అర్థం చేసుకున్నాడు అతను.

ఆరోజు ఆదివారం. జ్వరం వచ్చి చిట్టిబాబు సలపరంతో సోమయాజులుగారి యింట్లో పడుకున్నాడు. మాణిక్యానికి నెలరోజులనుంచి మలేరియా జ్వరంవల్ల బాధపడుతూ చాలా నీరసించి, ఇంటి చాకిరీ చేసుకోలేని పరిస్థితిలో ఉందని అవధాని ఉత్తరం వ్రాశాడు. ఒక వారం పది రోజులు మాణిక్యానికి ఆసరాగా విజయనగరంలో ఉండి వస్తానని రాధమ్మ వెళ్లిపోయింది. అలనాటు ప్రకారం, చిటిబాబు, ప్రకాశం సోమయాజులు ఇంట్లో భోంచేస్తున్నారు.

రెండు రోజులు మామూలుగా మసిలి చిట్టిబాబు మూడవరోజు ప్రొద్దున్న మంచం మీదనుంచి లేవలేకపోయాడు. జ్వరం తీవ్రత బాగా హెచ్చింది. ముఖం బుడగలా ఉబ్బింది. గాయాలబాధ ఎక్కువైందని, పళ్లు సలుపుతున్నాయని బాధపడుతున్నాడు చిటిబాబు. డాక్టరుగారు వచ్చి, చిట్టిబాబు పరిస్థితి చూసి, గాయాలు కడిగి కట్లు కట్టి తల వంచుకుని వెళ్లిపోయారు.

మర్నాడు విచిత్రమైన మార్పు కనిపించింది చిటిబాబులో. ఒళ్లు నల్లబడింది. ఒంటినిండా ఏవో తెల్లని పొక్కులు లేచాయి. ఒక్క మూల్గుతప్ప మాట మానేశాడు. ప్రొద్దున్న, మధ్యాహ్నం సాయంత్రం అన్నపూర్ణయ్యగారు వచ్చి పరీక్షించి పోతున్నారు. ఆరోజు రాత్రి చిట్టిబాబు మూల్గుకూడా మానేశాడు. చేతులు కాళ్లు బిగిసి కర్రలైనాయి. అన్నపూర్ణయ్యగారు కంగారుగా ఒక ఇంజక్షను యిచ్చారు. అరగంటకి కూడా చిట్టిబాబులో చలనం కలగలేదు.

'రాధమ్మకు ఒక టెలిగ్రాం యివ్వండి తక్షణం రమ్మని' అన్నపూర్ణయ్యగారు సోమయాజులుతో అన్నారు. సోమయాజులుకు ముఖంలో నెత్తురుచుక్క లేదు. సీతమ్మ ముందు పరిస్థితులు గురించి ఆలోచిస్తూ కలవరపడుతోంది. ప్రకాశం కంగారుగా తడబడుతూ చిట్టిబాబు మంచంచుట్టూ పచార్లు చేస్తున్నాడు. రామలింగశర్మ తల్లి వెనకాల నక్కుతూ ముసులుతున్నాడు.

'ఇంక లాభంలేదా?' సోమయాజులు గాభరాగా అన్నపూర్ణయ్య చెవిలో గుసగుసలాడాడు.

అన్నపూర్ణయ్య పెదిమ విరిచాడు.

డాక్టర్ను పంపించి, రాధమ్మకు

పెత్రగాం యివ్వడానికి సోమయాజులు ఉరకలు వేసుకుంటూ నడిచిపోయాడు.

అర్ధరాత్రివేళ, చిట్టిబాబు కన్నుమూశాడు. ప్రకాశం గొల్లుమని ఏడ్చాడు. సీతమ్మ, సోమయాజులు నిగ్గుపడిపోయి కంట తడిపెట్టుకున్నారు. చుట్టుప్రక్కల అమ్మలక్కలు నిట్టూర్పులతో జాలితో నిలుచుని పోయారు.

మర్నాడు సాయంత్రానికి రాధమ్మ, రైలులో దిగింది. నిశ్శబ్దంగా గుమ్మంలో నుంచున్న అమ్మలక్కలను కొడుకు ఆరోగ్యం గురించి గాభరాగా ప్రశ్నించింది. అమ్మలక్కలు సమాధానం చెప్పలేకపోయారు. ఒక్క పరుగులో యింట్లో ప్రవేశించి, చిట్టిబాబు శవంపై పడి గోలు గోలున ఏడ్చింది రాధమ్మ. గుండెలు బాదుకుంది, తల గోడకేసి కొట్టుకుంది. 'గంగలో దిగి చచ్చిపోతా నర్రోయి' అంటూ అల్లరి చేసింది. ఒక్కగానొక్క కొడుకు చనిపోయేడనే విచారంలో ఉన్న రాధమ్మ కొడుకు ఎలా చనిపోయేడనే విషయం యింకా పరిశోధించుకోలేక పోయింది. కడుపు శోకం ఆమెలో మంటలు రేకెత్తించింది. అవి తట్టుకోలేక గిలగిలలాడింది. విలవిలా విలపించింది.

కాలం మించిపోతూందని, బాబు శవానికి దహనసంస్కారాలు చేయించే బాధ్యతను ఇరుగు పొరుగు పెద్దలు సోమయాజులుకు జ్ఞప్తికి తెచ్చారు. యథావిధిగా అంత్యక్రియలు పూర్తిచేశారు.

వచ్చిన కష్టానికి సానుభూతి చూపిస్తూ, సీతమ్మ, రాధమ్మను తన యింట్లో కొంత కాలం ఉండమని, బ్రతిమాలింది. కర్మవల్ల చిట్టిబాబుకు గాయాలు తగలడంచేత జ్వర తీవ్రత హెచ్చి చనిపోయాడని అమ్మలక్కలు రాధమ్మకు నూరిపోశారు. ఆ మాటలు విన్న రాధమ్మ చెల్లెలు ఇంట్లో ఒక్క క్షణం ఉండకూడదనుకుని స్వగృహానికి వెళ్ళిపోయింది.

సీతమ్మ సలహాప్రకారం సోమయాజులు అన్నపూర్ణయ్యగారి దగ్గరకు వెళ్లాడు. డాక్టరుగారు తాపీగా చుట్ట కాలుస్తూ ఒంటరిగా కూర్చున్నారు.

'ఇంతలో కుర్రాడికి చావు ముంచుకు వస్తుందని అనుకోలేదు' తడిలేని కళ్ళతో తల దించుకున్నాడు సోమయాజులు.

అన్నపూర్ణయ్యగారు ఒక నిట్టూర్పు విడిచారు.

'గాయాలవల్ల చనిపోలేదుగా?' సోమయాజులు తనపైన అపనింద పడకూడదనే ప్రయత్నంలో డాక్టరుచేత 'ఊ' అనిపించుకుందా మనుకున్నాడు.

'అది ఒక కారణము కాదని చెప్పలేము' అన్నారు అన్నపూర్ణయ్యగారు. ఆలోచనతో ఆయన పెదిమలు చిత్రంగా వంకర తిరిగాయి.

'మీకు పుణ్యముంటుంది. మాకు అపనింద రాకుండా చూడండి' సోమయాజులు కుర్చీలోంచి తత్క్షణం లేచి అన్నపూర్ణయ్య చేతులు పట్టుకున్నాడు.

'ఇంత గాభరా ఎందుకండి?' అన్నపూర్ణయ్యగారు నవ్వారు.

'అందరూ అనుకుంటున్నారు. గాజు పెంకుల గాయాలవల్లే చిట్టిబాబు చనిపోయాడని.'

'అది నిజంకాదని ఎవ రనగలరు?'

'బాబ్బాబు! తమ కాళ్లు పట్టుకుంటాను. ఈ అపనింద వస్తే, మాకు పరువు ప్రతిష్ఠలు ఉండవు. ఇది పైకి పొక్కితే, కుర్రాడికి పోలీసులవల్ల ప్రమాదం కూడా కల్గుతుందేమో' సోమయాజులుకు ముచ్చెమటలు పోశాయి. బుజంమీద కండువా తీసుకుని తుడుచుకున్నాడు.

సోమయాజులును చూసి జాలిపడ్డారు డాక్టరుగారు.

"గాయాల సంగతి అటుంచి, అతనికి ఏదో విషజ్వరం వచ్చింది. ఆ జ్వరం లక్షణాలన్నీ ఇప్పటికీ నాకు పూర్తిగా అర్థం కాలేదు. నిజం చెప్పవచ్చు చూడండి! సరియైనమందు నేను ఇవ్వలేకపోయానా అని ఒకవిచారం నాకు లేకపోలేదు" అన్నపూర్ణయ్యగారి నిర్మలవదనం చూడగానే

ప్రకాశం, ఆ ఏడు కాలేజీ ఎన్నికలలో పాల్గొనాలనే ఉద్దేశంతో కొందరి స్నేహితులను కలుసుకుని, వారి సహాకారం సంపాదించాలని, వీధిలోకి వెళ్ళిపోయాడు. సోమయాజులు తన స్వంతవ్యాపకాలలో నిమ

స్నుడా ఎవరో ఒక పెద్దమనిషివస్తే ఆయనతో వెళ్ళాడు. సీతమ్మ భోజనాలు ముగించి, అమ్మలక్కలతో ఊసుబోకకు కబుర్లు చెప్పుదామని ప్రక్కయింటికిపోయింది.

రామలింగశర్మ, బల్లమీద అద్దం ముందు నుంచుని సినీమాకి వెళ్ళడానికి ముస్తాబవుతున్నాడు. ముఖానికి శ్రద్ధగా, స్నో పౌడరు వ్రాసుకుంటున్నాడు. గంటనుంచి అదేపనిగా ముఖాన్ని అందంగా తయారు చేసుకుందామని రామలింగశర్మ పడే తంటాలు చూసి చిట్టిబాబుకు నవ్వువచ్చింది. జ్వరంతో ఒదిగి పడుకున్నవాడు ఊరకోక రామలింగశర్మను హేళన చెయ్యాలనుకున్నాడు.

'పాగచూరిన వంటింటిగోడకు ఎంత సున్నంవేస్తే తెల్లబడుతుంది?' వ్యంగ్యంగా స్వగతంలో అనుకున్నట్లు అనేసి నవ్వుతూ చూశాడు శర్మవైపు.

'నాగొడవ నీకెందుకు? నీదారినపడుండు' శర్మ అరిచాడు.

'నిన్నుగురించి ఎవడన్నాడోయి! నాకేదో జ్ఞాపకమొచ్చి నేననుకున్నాను' చిట్టిబాబు సమర్థించుకున్నాడు.

'బుద్ధిలేనిగాడిదలు అలాగే అరుస్తాయి'

'మాటలు జాగ్రత్తగా రానీ'

'నువ్వు జాగ్రత్తగా మాట్లాడు. మాయింట్లోపడి మింగడమేకాకుండా యీగోల కూడా ఏమిటి?'

'నువ్వు మాయింట్లో మింగినపుడో!'

'నీలా గాడిదలామాత్రం అరవలేదు'

'గాడిద అన్నావంటే పళ్లూడగలవు జాగ్రత్త'

'మొగాడవైతే పళ్లూడగొడతావు'

"ఆ. ఊడగొడితే నీ దిక్కున్నచోట చెప్పుకోవాలి"

'అట్టె వాగావంటే కపాలమోక్షంచేస్తా జాగ్రత్త. జ్వరంతో ఛస్తున్నవాడవు చావక నాగొడవ నీకెందుకు'

'ఏమిటిరా పేలుతున్నావు' కోపంతో జ్వరం లెక్కచెయ్యక మంచంమీదనుంచి లేచాడు చిట్టిబాబు.

'నిన్ను చావమంటున్నాను' అరిచాడు రామలింగశర్మ.

చిట్టిబాబు కోపంతో రామలింగశర్మవైపు వచ్చాడు అలవాటైన కుస్తీపోజు పెట్టి. రామలింగశర్మ చిట్టిబాబుపై గంతి ఒళ్ళంత రక్కేశాడు. చిట్టిబాబు గీరలతో బాధ పడుతూనే శర్మను క్రిందపడేసి ఒక్కగుద్దు గుద్దాడు నడ్డిమీద. శర్మ ఉక్రోషంతో లేచి బల్లమీదఉన్న దళసరి అద్దం తీసుకుని చిట్టిబాబుమీదకు రివ్వున విసిరేశాడు. అద్దం ఆ విసురుబరువులో గట్టిగా చిట్టిబాబు ముఖానకు తగిలి ముక్కలయ్యింది. 'బోబోయి' అని ఒక్కకేక పెట్టాడు చిట్టిబాబు. చితికిన అద్దం పెంకులు చిట్టిబాబు ముఖంలోగ్రుచ్చుకుని తలను, ఫాలభాగాన్ని దవడలను గాయపరిచాయి. ముఖంలోని గాయాలనుంచి రక్తం చిమ్మింది.

గాయపడిన చిట్టిబాబును చూడగానే భయంతో రామలింగశర్మ బయటికి పారిపోయాడు. చిట్టిబాబు బాధతో మూల్గుతూ ఏడ్చేడు గట్టిగా. ఏడ్పులు విని సీతమ్మ, ప్రక్క ఇంటివారు చిట్టిబాబునగ్గరకు వచ్చారు. ముఖంలోనూ దవడల్లోనూ గ్రుచ్చుకున్న అద్దం పెంకులు తీసుకోలేక ఏడుస్తున్న చిట్టిబాబునుచూసి సీతమ్మ నిర్ఘాంతపోయింది.

'చూడు పిన్ని, శర్మ ఎలా కొట్టాడో' బాధతో గట్టిగా ఏడ్చేడు చిట్టిబాబు.

'వాణ్ణి నువ్వేం చేశావురా?' సీతమ్మ తన కొడుకుకు కూడా యిటువంటి ప్రమాదం జరిగిందేమో అని భయపడింది.

'నన్ను కొట్టి పారిపోయాడు' చిట్టిబాబు బాధతో 'అమ్మోయి బాబోయి!' అంటూ మూల్గసాగాడు.

అమ్మలక్కలందరూ కూడి చిట్టిబాబు ముఖాన గ్రుచ్చుకున్న గాజుపెంకులు మెల్లిగా ఊడదీసి, చన్నీళ్లతో ముఖం కడిగారు. ప్రకాశం లోన అడుగు పెట్టగానే ఎదురుగా గాయాలతో పడిఉన్న చిట్టిబాబును చూసి ఒక్క నిమిషం స్తబ్ధుడై పోయాడు. కాని రామలింగశర్మతో ఘర్షణ జరిగి ఉంటుందని మాత్రం ఊహించుకున్నాడు.

'ఒరే అన్నపూర్ణయ్యగారిని ఒకసారి తీసుకురా నాయనా' సీతమ్మ కొడుకు చేసిన తప్పుకప్పుకుందామని ప్రకాశం కనిపించగానే ఆత్రుతతో వాడిని బయటికి పంపించేసింది.

సీతమ్మకు లోపల భయం పట్టుకుంది. జ్వరంతో ఉన్న చిట్టిబాబుకు తగిలిన గాయాలు ఎన్నాళ్లకు మానుతాయో అని.

డాక్టరు అన్నపూర్ణయ్యగారు చిట్టిబాబు గాయాలు చూడగానే గాభరా పడ్డారు. గాయాలు కడిగి, కట్లు కట్టారు.

'గాలిలో మాత్రం తిరగక [illegible] మాత్రం పడుండాలి. ఏమాత్రమైనా అశ్రద్ధగా ఉంటే నీ ఆరోగ్యం ఎలా పరిణమిస్తుందో నే చెప్పలేను' డాక్టరుగారు చిట్టిబాబుకు సలహా ఇచ్చారు.

'ఫరవాలేదమ్మా. ఈ గాయాలు రేపటికి మానిపోతాయి. కాని మీ కుర్రాడినిమాత్రం కొంచెం అదుపులో పెట్టండి. చాలా ప్రమాదం, ఇలా అందరినీ కొడుతూంటే' అన్నపూర్ణయ్య నొచ్చుకుంటున్నట్లు సీతమ్మను మందలించాడు.

సీతమ్మ సమాధానం ఏమీ యివ్వక మౌనంగా నుంచుంది. డాక్టరుగారు వెళ్ళిపోయారు.

శర్మ యింటికి రాగానే రాత్రి, సోమయాజులు, సీతమ్మ కూకలేశారు. ఎప్పుడూ చెయ్యిచేసుకోని సీతమ్మ నల్గురూ వినేటట్లు అరుస్తూ రెండు దెబ్బలు వేసింది శర్మని.

చంచలత

ఫోటో: కమ్రుద్దీన్ ఖాన్—కటక్.

 ## ఉదయ కిరణాలు 

సోమయాజులు చేరుకున్నాడు. తనతో పాటు చిట్టిబాబు చావుకు మరొకడుకూడా ఉన్నాడన్న విషయం అతనికి ధైర్యం కల్గించింది. సోమయాజులు తన కుత్సితబుద్ధి దాచుకోలేకపోయాడు.

'అయితే చిట్టిబాబుచావుకు మీరుకూడా ఒకవిధంగా బాధ్యులన్నమాట' నవ్వుతూ సోమయాజులు చేతులు నలుపుకున్నాడు.

అది ఒక వికృత నవ్వులా కనిపించింది డాక్టరుగారికి. చిట్టిబాబు జ్వరలక్షణాలు పరీక్షించుకుంటున్న ఆలోచనలో ఏమంటున్నదీ సరిగా పట్టించుకోక తన ఆలోచన చెప్పేశారు అన్నపూర్ణయ్యగారు. అలా చెప్పేసినందుకు నాలిక కరుచుకున్నారు. సోమయాజులు రోగనిర్ణయం చేసుకోలేని తన అశక్తి గురించి ప్రచారం చేస్తాడా అని భయపడ్డాడు. ప్రసంగం గబుక్కున మార్చేశారు అన్నపూర్ణయ్యగారు.

'ముఖంలో ఎక్కడో గాజు పెంకు కండరాల్లో దూరిఉంటుంది. అందువల్ల అతని శరీరం సెప్టిక్ అయింది. కుర్రాడి చావుకు ఇదేకారణమై ఉంటుందని ఇప్పటికి నిర్ణయించుకున్నాను' సణుక్కున్నాడు అన్నపూర్ణయ్య. చిట్టిబాబుచావునింద మళ్ళీ తనమీదకేవచ్చిందని గమనించిన సోమయాజులు కొంత బాధ్యత డాక్టరుపైన ఉంచాలనే ఉద్దేశంతో 'మీరు గాయాలకు కట్టు కట్టారుగదా. జాగ్రత్తగా కొంచెం చూసి ఉంచవలసింది. మీ బాధ్యత విస్మరించడం భావ్యంకాదు' సోమయాజులు ముఖం చిట్లించాడు.

అన్నపూర్ణయ్యగారు సోమయాజులు ప్రవర్తనచూసి కోపం తెచ్చుకున్నారు. 'మంచిది. మీరు వెళ్ళండి ఇంక' అంటూ లేచి లోపలిగదిలోకి వెళ్ళిపోయాడు.

సోమయాజులు ఇంక చేసేదిలేక తిరుగు ముఖం పట్టాడు. గాయాలవల్ల సెప్టిక్ అయి చిట్టిబాబు చచ్చిపోయాడంటే రోగనిర్ణయం చెయ్యలేక డాక్టరు కుర్రాణ్ణి చంపేశాడని సోమయాజులు విషప్రచారం ప్రారంభిస్తాడేమో అని అన్నపూర్ణయ్యగారు భయపడ్డారు. 'గాయాలవల్లకాదు. విషజ్వరంవల్ల చచ్చిపోయాడు చిట్టిబాబు' అని అన్నపూర్ణయ్య ఎదురున్నవారివద్ద సంజాయిషీ యిచ్చాడు.

ఏమైతేనేం! రాధమ్మ తన కొడుకు గాయాలవల్లే చనిపోయాడని నిర్ధారణ చేసుకుంది. లోపల ఉక్రోషం ఆగక, చెల్లెలును, శర్మను ఏమీ అనలేక, లోలోపలే కుమిలి కుమిలి ఏడ్చింది. వచ్చిన బంధువులందరూ, సీతమ్మను, శర్మను ఇష్టమొచ్చినట్లు విడ్డూరంగా సాధిస్తూ, రాధమ్మను పరామర్శించారు. బంధువుల మాటలువిని ముఖం చెల్లక సీతమ్మ, సోమయాజులు, రాధమ్మతో మాట్లాడలేకపోతున్నారు.



నిశ్చలత — ఫోటో: ఎమ్. వీరభద్రరావు—విజవాడ.

విజయనగరంనుంచి అవధాని ఒక వారం సెలవుపెట్టి వచ్చాడు. పరిస్థితులన్నీ విని సీతమ్మను ఛడామడా తిట్టాడు—కొడుకు పెంకితనం అదుపులో పెట్టలేకపోయిందని. భార్య అవధాని మాటలువిని కుక్కిన పేనులా ఎదురు సమాధానం చెప్పలేకపోతున్నప్పుడు, తనెందుకు మాట్లాడాలని సోమయాజులు బుర్ర వంచుకున్నాడు. జాలి గుండెగల రామమ్మ ఒక్కగాని ఒక్క కొడుకు చనిపోతే ఎంత కడుపుశోకంతో దహించుకుపోతుందో అవధాని అర్థం చేసుకున్నాడు. కష్టాలలో ఉన్నవారిని సంరక్షించి ఆదుకునే పని తాను నెత్తికు తీసుకున్నట్లు రామమ్మను తీసుకుని విజయనగరం బయలుదేరాడు అవధాని. ప్రకాశాన్ని తన ఇంట్లో భోజనానికి ఉంచమంది సీతమ్మ. అవధానికి ఇష్టంలేక, ప్రకాశాన్ని కాలేజి హాస్టలులో చేర్పించాడు.

బాల్యంనుండి స్నేహితుడుగా, బంధువుగా, తోటి విద్యార్థిగా కలిసిమెలిసి తిరుగుతూ, ఎంతో ఆనందం, ప్రోత్సాహం యిచ్చిన చిట్టిబాబు వారం రోజుల్లో అదృశ్యమైపోవడం ప్రకాశానికి తీరని బాధ కలగచేసింది. మొట్టమొదట చూసిన తండ్రి మరణం ప్రకాశంలో వైరాగ్యం కలిగిస్తే, చిట్టిబాబు మరణం ప్రకాశంలో పూర్తి నిర్లిప్తత, నిర్లక్ష్యం వృద్ధిచేశాయి. ఆత్మీయుడు లేనిలోటు ప్రకాశానికి విస్పష్టంగా కనిపించింది. తండ్రి మరణించినప్పుడు చెప్పలేని సమయాల్లో, రోగాల్లో కష్టాల్లో కుడిభుజంగా సహాయం చేసిన చిట్టిబాబు ఋణం ఇంక ఈ జన్మలో తీర్చుకునే ఆస్కారం లేదని ప్రకాశం లోలోపల దుఃఖించాడు.

'శతాయువుగా బ్రతుకగలనని మనిషి ధీమాగా నిశ్చయించుకుంటాడు. ఎప్పుడు ఏ రీతిగా మరణంవచ్చి మీదపడుతుందో ఎవరికీ తెలియదు. పద్దెనిమిది సంవత్సరాలు కూడా పూర్తికాక భవిష్యత్తుఅంతా ముందే ఉన్న చిట్టిబాబు చనిపోవడం తనకి కూడా ఒక పాఠమనుకున్నాడు ప్రకాశం. ఎన్నో ఆశలు, ఆశయాలు సృష్టించుకుని భవిష్యత్తు కోసం వేచిఉంటే ఏ నిమిషంలో చావు వచ్చి, ఆశలు, ఆశయాలు నిరుపయోగం చేస్తుందో ఎవరికీ తెలియదు. భవిష్యత్తును గురించి ఆలోచించక, జీవితంమీద నిర్లక్ష్యంతో, ఆశలు, ఆశయాలు, ఎప్పటికప్పుడు నెరవేర్చుకుంటేనే జీవితం ఒక నిర్దుష్టమైన పద్ధతిలో సార్థకం కావచ్చునే ఊహ ప్రకాశం మనస్సులో నాటుకుంది.

చిట్టిబాబు చావుకు కారకురాలని సీతమ్మ యింటికి వెళ్ళడం మానేశాడు ప్రకాశం. సోమయాజులు కనిపించి మాట్లాడితే, అడిగిన ప్రశ్నలకు ముక్తసరిగా సమాధానాలు యిచ్చి, తలవంచుకుపోతున్నాడు. రామలింగశర్మను ఎప్పుడూ ఎరగనట్లు ముఖం త్రిప్పుకుని వీధుల్లో పోతున్నాడు. ఈప్రవర్తన చూసి సోమయాజులు, సీతమ్మ కూడా ప్రకాశాన్ని తమ యింటికి ఆహ్వానించడం మానేశారు. [ఇంకా వుంది]

# తెలిసి చేసే తప్పు

## ద్వివేదుల సోమనాథశాస్త్రి

ఏడాది పుత్రవాడిని ఎత్తుకుని కమల ముద్దు లాడుతూంది:—

"మావాడు డాక్టరీ చదువుతాడు! లాయిరీ చదువుతాడు? జడ్జీ అవుతాడు? ప్రొఫెసర్ అవుతాడు! లండను వెళతాడు!—అప్పుడు పాతిక వేలరూపాయలు కట్నం యిస్తేగాని పెళ్లే చెయ్యం! ఏమనుకున్నారు?" అంటూ మురిసిపోతూంది.

ఆమె భర్త చంద్రం ఏమీ మాటాడలేదు.

"ఏమంటావు చంద్రం—మీ ఆవిడ అలా అంటోంది?" అని అడిగేను—

"ఉత్తినే అలా అంటోంది గాని యీ కాలంలోగూడా కట్నాలు తీసుకోడం ఏమిట్రా?"

"ఏం? ఎందుకు తీసుకోకూడదు? మీరు తీసుకోవచ్చా? మీవాడు తీసుకోకూడదా?" వెంటనే కమల అడిగింది.

"అవును! అదీ నిజమే మరి!" అని నేనన్నాను.

ఈ మాట విని చంద్రం అదోలా బాధపడిపోయేడు.

"అవును నేను తప్పుజేసేను...కాని నాకు అప్పటికి ఏమీ తెలీదు...ఎలాగయినా కట్నం తీసుకోవడం తప్పే...నాకు పెళ్ళయేవేళకి ఆ విచక్షణాజ్ఞానం లేదు. అంత ఆలోచనాశక్తి, స్వతంత్రం లేవు. అప్పటికి నాకింకా చదువే పూర్తికాలేదు. నామాట, ఆ వయస్సులో ఎలా చెల్లుతుంది? లక్ష్యపెట్టేవాళ్లెవరు? ఎటువంటి ఆదర్శాలు వున్నా అటువంటి పరిస్థితుల్లో నెగ్గడం చాలా కష్టం—చిన్నతనంలో సరదాలు తీరుతాయని ఒప్పేసుకున్నాను. కాని అవతల పెద్దవాళ్ల మతలబులు తెలుసుకోలేకపోయేను— కట్నం తీసుకోడం నా కిష్టంలేదు—ఇప్పుడా మాట, నిబ్బరంగా, ధైర్యంగా పైకి అనలేను!— అన్నానంటే—నువ్వెందుకు తీసుకున్నావని దెప్పుతారు— నేను తప్పుచేశాను కనక అది సమర్థించుకుందుకని 'తీసుకోండి కట్నాలు' అని మనస్ఫూర్తిగా అనలేను!... నా పరిస్థితి యిలా వుంది. ఏంచెయ్యమంటావు?...యీ కమలకూడా మాటి మాటికీ యిలాగే దెప్పుతూవుంటుంది గాని నా అభిప్రాయాలు ఏ పరిస్థితులవల్ల మారిపోయాయో యిందులో పొరపాటు ఎవరిదో— ఎవరికి కావాలి?"

అని చంద్రం వుద్రేకంతో అన్నాడు.

అలా అనగానే అతని ఆదర్శాలేమిటో —ఎలాటి పరిస్థితులవల్ల అవి పాడయినాయో వినాలని నాకూ కుతూహలం కలిగింది.

"అయితే అదేమిటో విపులంగా చెప్పవోయ్ వింటా!" నన్నాను.

"ఎందుకు లెద్దూ! ఎవరు నమ్ముతారు? వుత్తి కాకిగోలే గాని!"

"అలా కాదు చెప్పు—"

"అయితే ... అదుగో ఆ కమలని మధ్య మధ్య అడ్డపడకండా కాయాలి! లేకపోతే నా తరంగాదు!" అన్నాడు. అది విని—

"అయ్యో నాకేం! అంత కావాలంటే చెప్పకోండి! ప్రజ్ఞ! నవ్వేవాళ్లు లేకపోతే సరి ... నేనూ వింటాను!" అంది కమల.

"మధ్యని అడ్డుప్రశ్నలు వెయ్యొద్దు!"

"అలాగే"

అన్న తర్వాత చంద్రం మొదలెట్టేడు—

"నా చిన్నతనంలో - నే - నెక్కడికి వెళితే అక్కడ పెళ్లాలు పుట్టుకొచ్చేవారు! అందికే బంధువులయిళ్లకి వెళ్లడం అంటే అదేమిటో సిగ్గుగానూ, మరేమిటో సరదాగానూ కూడ వుండేది. నేను యింకా చిన్న క్లాసులు చదువుకుంటూండగానే ... మా బంధువులందరికీ వారి కుమార్తెలకు నేనే కనిపించేవాడిని. అప్పటినుంచే పెళ్లిమాటలాడడం జరిగింది. అందరికళ్ళూ నామీదే కేంద్రీకరించివుండడంవల్ల సెలవలు యిచ్చినప్పుడల్లా ఏదో ఒకమిషమీద ఎవరో ఒకరు వంతులచొప్పున వాళ్ళయిళ్ళకి తీసుకువెడుతూ వుండేవారు. నేను గుంటడినయినా, వారికి అల్లుణ్ణి అయినా, అవకపోయినా, నా ఛాన్సు బావుండేది. అల్లుని మర్యాదలతో వెళ్ళి తిరిగి వచ్చేవాడిని. - క్రొత్తక్రొత్తబట్టలతోనీ, నాకూ ఒక పెళ్ళాం వున్నదికదా అన్న నిబ్బరంతోనీ, వ్రేలి వుంగరాలతోనీ, ఇలా కుబేరుడిలా ఇంటికి వచ్చేవాడిని.

ఇందరికీ నా యీడుకి జోడు అయిన అమ్మాయిలు వుండడం, నా అదృష్టం - అటువంటి తిథి వార, వత్సర, నక్షత్రాల్లో పుట్టడం సామాన్యమా? - 'గాంధీగారు బ్రతికినకాలంలో వుండి ఆయన్ని స్వయంగా చూశాను' అని చెప్పకోడం కొందరికి గొప్ప. మరి కొందరికి - 'ఒకటో ప్రపంచ యుద్ధం చూశాను' అని చెప్పగుంటే గొప్ప - ఇలా ప్రతివారికి వాళ్ళవాళ్ళ కాలంలో ఫలానా గొప్ప విషయం జరిగింది అని చెప్పకోడం గొప్ప- అలాగే నాకేమిటి గొప్పంటే-

నేను పుట్టినతర్వాతే మా బంధువుల్లో అందరికీ ఆడపిల్లలు పుట్టడం, వాళ్లందరూ యించుమించు ఒకేవయస్సుగలవారయి వుండడం, అటువంటిసమయంలోనే నేను వారందరికీ, యీడుజోడుల్లోనూ, అందచందాల్లోనూ, ఒడ్డుపొడుగుల్లోనూ, అన్నిట్లోనూ, సరిపడ్డవాడుగా కనపడ్డం జరిగినా జరగకపోయినా, ఎక్కడకెళితే అక్కడ 'ఇదుగో వీడే దీని మొగుడు' అని అనిపించుకోవడం నాకు గొప్ప - ".

"ఓహోహో! ఏం వర్ణించేరండీ! ఏం గొప్పలు! ఆడవాళ్ళందరూ మీకోసమే నోములునోచి పుట్టినట్టుంది! మీరేగాని మరెవరూ మొగాళ్లు లేనట్టుంది ఆహా!" అంటూ మధ్యలో కమల ఎగతాళిచేస్తూ నవ్వింది!

"చూశావోయ్ - అందికే నే చెప్పనన్నాను - నాకోసం ఎంతమంది ఎగబడ్డారో? ఎంతమంది పోటీలు పడ్డారో దీనికేం తెలుసు?...దానికూడా కారణం వుంది చెబుతా విను - " అన్నాడు.

"ఆడపిల్లలకి పెళ్లి చేసేముందు, తల్లిదండ్రుల దృష్టులు, వాంఛలూ ఎన్నో అన్వేషిస్తూవుంటాయి. బహుశా నాపరాన్ని యివి అయివుండొచ్చు...

పుట్టగానే తండ్రికి వక్రించి తూగుటుయ్యా[illegible]నవసం చేతనూ, ఒకవేళ పె[illegible]కాపరానికి వచ్చేవరకూ ఉద్యోగం దొరక్కపోతే, యజమానిని నేనే కాబట్టి పిక్క చేతిలోనే వుంటుంది కనుక తమ కూతురి ముద్దు ముచ్చట్లకి, మాతి ముచ్చుపులకి కించెత్తూ లోపం జరగదనిన్ని - భర్త పోవడంచేత మాఅమ్మ మరి ఎవరితో నూ ఏకమవడానికి అవకాశంలేక కూతుర్ని బాధపెట్టలేదుకదాఅనిన్ని, కూతురు అల్లుడూ ఏకమయితే ఒంటిదయిన అత్తగారి ఆటలు సాగక చచ్చినట్టు కోడలెలా చెబితే అలా పూరుకుంటుందిఅనిన్ని, అప్పుడు తమ కూతురు మహారాణీ అయి గృహసామ్రా

జ్యాన్ని...సర్వాధికారాలతో అనుభవించి ఏలవచ్చుననిన్నీ,—

తండ్రితద్దినాలకి తాతలఆస్తిన్నీ ... తదనంతరం తిండికి తండ్రి ఆస్తిన్నీ పుష్కలంగా వుండడంవల్లనూ, ఇరస్తా పరస్తా ఎవ్వరూ లేక ఏకచక్రంలాగ ఎటుచూసినా వారసప్పురుకు అన్నది లేకండా ఒక్కడినే వుండడంవల్లనూ, ఆస్తి పాస్తి యిత్యాది సర్వవిషయాల్లోనూ చిక్కులుగాని, అనుమానాలుగాని యిబ్బందులుగాని కించెత్తూ లేకపోవడం వల్లనూ-

ఒకవేళ ఆడ బొడుచులు వుంటే తమ కూతుళ్లకి అచ్చులు వేసి ఆటకట్టేస్తారేమో అని అనుకుందికి... పెళ్ళిలో మంగళహారతి పళ్లెం పట్టడానికయినా ఎవరూ లేకపోవడం వల్లనూ, తద్వారా ఆడబొట్టె లాంఛనాలు మిగులుటవల్లనూ, చిన్నతనంనుంచి పెద్ద క్లాసులు చదవడంవల్లనూ, యింకా ఎన్నో యిలాటి చిల్లర మల్లర విషయాల్లోనూ, ఎన్నికగాడినయి, మన్నికగాడి నయినాను.

అసలు నాకు, - నాకేమిటి....ఎవళ్లకయినా - సరిపడి, పనికొచ్చే ఆడపిల్లలు (కూతుళ్లు) లేని మేనమావలుంటే - చెడ్డకోపం వస్తుంది...రాదూ? మేనల్లుడు వున్నాడూ అంటే - మేనమావ డ్యూటీ - కూతుర్ని కని వాడికోసం రిజర్వు చెయ్యడమే...అది విధి! అలా లేనప్పుడు వాళ్ల మొహం కూడా చూడకూడదు! వున్నారు! నాకూ వున్నారు నలుగురు! ఎందుకూ? బట్ట తలమీద షాపిడిలాగ!

అయితే నుడిలో మెల్ల అన్నట్టు ఒక మేనమావ పరువు నిలబెట్టేడు. నేనెందుకు తన చెల్లెలికి ఉద్భవించేనో గ్రహించి అందుకున్నాడు. ఇంక అడిగారా? - ఎలాగూ వీడి కిది తప్పదంటే దానికి వీడు తప్పదూ - ఓహోహో! ఇహీహీ....! అని అందరూ అనుకున్నారు. అయితే మా అత్తమాత్రం అలాగే వుండేది. అత్తకీ మావకీ మధ్య మావయ్య జంధ్యాలు తెంపుకోవడంవరకూ, అత్త నూతికి పరుగెట్టి...ఆ ఏడుపులో...నూతినీళ్లో కొట్టుకుందామని అనుకున్నా ... కంటికి వెంట కారిన నీళ్లో నే కాస్సేపు కొట్టుకొని తిరిగి వచ్చేసేది. ఆ గోల యేదో నాకు తెలీదు. ఎంచేతంటే నే నప్పుడు ఏమీ ఎరగని చిన్నవాడిని. నాకు తెలిసిందల్లా, నేనూ, మా మరదలూ, గోడలు గెంతడం, వంతులాటలాడడం, - అందరూ మీరు 'మొగుడూ పెళ్లాలం'టే సిగ్గుపడిపోడం - అంతే.

పాపం మా మరో మావయ్యని చూస్తే జాలివేస్తుంది. వన్నెలాగయినా అల్లుణ్ణి చేసుకోవాలని మహా తాపత్రయపడేవాడు. ఎందరెందరో దేవుళ్లకు మొక్కుగొని ఆడపిల్లలి వే కనేవాడు! అయితే నేం! నన్ను అల్లునిగా చేసుకొనే భాగ్యం అతడి కుండొద్దూ! ఆ ఆడపిల్ల పుట్టినప్పుడల్లా "ఇదిగో దీన్నిచ్చి పెళ్ళిచేసేస్తా!" అనేవాడు - అదేం ఖర్మమో లేక నా జాతక విపరీతమో గాని అలా అన్న వెంటనే - నఫా! ఆ పిల్ల కాస్తా "వీడికా నన్నిచ్చి పెళ్ళిచెయ్యదల్చుకున్నావు! అమ్మో! నాన్నా! నా కొద్దు బాబూ అంతకన్నా చావు నయం!" అన్నట్టుగా చనిపోయేది! మొదట్లో అది లెక్క చేయలేదు గాని అదో అలవాటు అయిపోవడంబట్టి నాకో దండం పెట్టి విరమించుకున్నాడు...ఆ తర్వాత పుట్టిన యిద్దరూ నక్షల్లా వున్నారు! చూడండీ చిత్రం - ఇంతకీ ఆ యింటి ఆడదానికీ నాకూ ఘటన లేందే? యింక మిగిలిన యిద్దరి మేనమావల వూసూ అనవసరం. నా అవసరం వేళకి యిచ్చుకోలేకపోయారు. ఆ తర్వాత ఎంతమంది లెఖ్ఖకొస్తే నేం?

వీళ్లయేరూ అంటే యిహను మా దొడ్డమ్మల వంశాలు. ఓహ్వో! కుప్పలు! వాళ్ళ కూతుళ్ళ కూతుళ్ళందరూ నాకోసం పుట్టిన వాళ్లే. వీళ్లందరూ అక్కయ్య కూతుళ్లు. అంటే పెళ్ళాం వంకవారినుండి మన కేదిముట్టినా, మననుండి వారికేది ముట్టినా మనలో మనం యిచ్చుకున్నట్టే— పైకి పోదు! అందుచేత యిచ్చిపుచ్చుకోడాలు పైకేగాని లోనంతా కలగాపులగమే! మేనమావ కూతుళ్ల సంబంధాలయితే యింత బంక వుండదు.

మేనమావ కూతురయితే చిన్నప్పుడు ఆటపాటల్లో ఒసే అంటే ఒరే అనడానికి జంకుతారేమో గాని యీ అక్కయ్య కూతుళ్లు జంకరు. అంత చనువు. మొదటి నుండి అదేంవిటో అక్కయ్య కూతురంటే అధికారం వస్తుంది! అలాగానే అదీ దచ్చినట్టు మనం చెప్పినదల్లా చేస్తుంది. మంచినీళ్లు తేవడం మొదలు, తిడితే పడడంవరకూ వుంటుంది.

మేనమావ కూతుర్ని మొదటినుండీ చాకిరి చెయ్యమంటే అసలు లెక్క చెయ్యదు. భర్తతాలూకు తల్లిని 'అత్త

అంతర్వేది దేవాలయంవద్ద సంతానార్థులైన స్త్రీలు.





# ★ తెలిసిచేసే తప్పు ★

గారూ' అని పిలుస్తుంది. మరి అక్కయ్య కూతురయితే ఒక్కొక్కప్పుడు 'అమ్మమ్మా!' అని యింకొక్కప్పుడు 'అత్తా' అని పిలుస్తుంది; అది ఆమెకు 'చాయిస్'.

మరదలులో గర్వం, జాణతనం, గొప్ప, అహంభావం, తక్కువమాట, చురుకుదనం, కోపం, ఉడుకుమోతుదనం వుంటే, మేనకోడలులో, వినయం, అమాయకత్వం, అణకువ, అభిమానం, భయం, మర్యాద, సహనం, శాంతం, ఓర్పు, వుంటాయి.

మా పెద్ద దొడ్డమ్మ పెద్దరికంలో నాకు ఎవరిని యివ్వడమా అన్న ప్రశ్న వస్తుంది! ఓరి బాబు! ఎంతమంది? పెద్దకూతురి కాయాంలోనుండి ఆఖరి కూతురి చేతికింద వరకూ పుంజీలు! పుంజీలు! పెళ్ళికావలిస్తే ఆడపిల్లల లిస్టు! మా పెద్దదొడ్డమ్మకి తన కాయాంలో ఎవరిని యిచ్చినా అందరూ మనుమరాళ్ళే కాబట్టి పక్షపాతం లేదు. నాకు అంతకన్నా లేదు. అంచేత ప్రత్యేకంగా రికమండేషన్లు లాభం లేదు. అందువలన మా పెద్దదొడ్డమ్మగారి హెడ్ క్వార్టరుకు నన్ను శెలవలకు రప్పించి, సింహాసనం మీద కూర్చోబెడితే—వంతు ప్రకారం ఒక్కొక్క అక్కయ్య వచ్చి, 'రావయ్యా అల్లుడుగారూ!' అని బాజాభజంత్రీలతో ఆహ్వానించి ఒకళ్ళకన్నా ఒకళ్ళు ముందుగా పందేలమీద మొదటి సీట్లు ఆక్రమించి ఉభయ ఖర్చులూ లాంఛనాలూ, భరించుకొని తీసుకు వెడుతూండేవారు. ఒకరిచ్చింది మరొకరు రహస్యంగా కనుక్కొని తృణమో పణమో ఎక్కువే యిచ్చేం అనిపించుకుందికి చూసేవారు. యీ కాంపిటీషన్ వల్ల వండుకున్న వాడికన్నా దండుకున్న వాడే మేలు అన్నట్లు—ఇంటికి చిన్నపిల్లజమీందారులా వచ్చేవాడిని. ఏనుగూ అంబారి ఒక్కటే తక్కువ!

తీసుకువెళ్ళింతర్వాత యీ అక్కయ్యత్త గార్లగోల చెప్పనలవి గాదు...

ఒకత్తో అత్తగారు— తన వూళ్ళో "ఫలానా ఫలానా" అని దండోరా వేయించేది.

రెండో అత్తగారు -

"ఇదిగో చూశారా యీడే మా అల్లుడు! మా ఫలానా అమ్మాయి మొగుడు! ఎలా వున్నాడు?" అని సాక్షులకోసం అన్నట్టుగా ప్రత్యక్షం చేసేది.

మరో అత్తగారు -

"మా అమ్మాయికి సరిగ్గా యీ డూ జోడూను! చిలకా గోరింకల్లా వుంటారు!" అని చెప్పి పొంగిపోయేది!

మరొకామె -

"బంగారంలాటి" మా పిల్లలాటిది వాడికి మరొకర్తె ఎక్కడ దొరుకుతుంది! వాడికా అదృష్టం వుంది కాబట్టి!" అని చిన్నకళ్ళతో పెద్దచూపు చూద్దామనుకుంది.

ఇలా బంధువుల్లో కావలసినవాళ్ళందరూ, నా ఒక్కడికోసం వాళ్ళల్లో వాళ్ళు పోటీలు పడుతుంటేగా యిహ పై సంబంధాల ప్రవాహ పరంపరలకి ఆనికలేదు. నాకింకా యిరవయ్యేళ్ళయినా జొరబడలేదు. యిహను అదొక్కటే తరవాయి అన్నట్టు యీ పిల్లల తల్లిదండ్రులందరూ నా పెళ్ళివాలుకి మా యింటికి రావడం మొదలెట్టేరు.

నా బేరం వెయ్యిరూపాయిలనుండి ఆరంభమయింది. ఈపాటికి మూడో నెంబరు అంటూవుండరేమో! వచ్చిన పెద్దలందరూ అన్ని విషయాలూ పెద్దవాళ్ళతోనే మాటాడినా నాదగ్గరికే వచ్చి పలకరించి పోతూ వుండేవారు. వాళ్ళు ఎటువంటివారో గాని, సి. ఐ. డీల్లా - ఎక్కడ లేనివీ కనుక్కొని వచ్చేవారు. ముందుగానే మా యింటి విషయాలు మాకన్నా బాగా వాళ్ళే తెలుసుకు వచ్చేవారు! ఎవరెవరు సమ్మంధాలకి వచ్చేరో! నా జీతంపాటి ఎంతలో వుందో. నా వంశం, కులం, గుణం, యివన్నీ ఎటువంటివో, యిలాటివన్నీ తెలుసుకొనే వచ్చేవారు.

అందులో ఒకరు -

"సంసారులం! ఏదో పెద్దగా సాగలేకపోయినా మా శక్తికొద్ది, అంతటా ఆనవాయితీ అయింది, నయ్య నూటపదహార్లూ, వెండికంచం, చెంబూ, ఎదుర్కోలాలూ, యిచ్చి తక్కిన లాంఛనాలు యథావిధిగా జరిపిస్తాం. డబ్బులో ఏముంది. వంశం, గుణం, వీటిల్లో వుంది గాని!, మా వంశం సంగతి వేరే చెప్పనక్కర్లేదు. ఒకమారు వచ్చి పిల్లని చూసుకోండి!" అన్నారు.

"పదిహేనువందలు కట్నం యిస్తాం, వాచీ, సైకిలూ, అలకపాన్పుమీద పార్కరు పెన్నూ, పాతికతులాల, గొంగళిపిల్లి వెండి గిన్నీ యిచ్చి లాంఛనోపేతంగా వివాహం జరిపిస్తాం, సరే అంటే ఫలానా నాడు ముహూర్తం యిద్దరిపేరా దివ్యంగా కుది

రింది.!" అని ముహూర్తం తేదీకూడా ఖైటు చేసుకు వచ్చేడు ఒకాయన.

"కుర్రవాడి కిష్టమొచ్చినంతవరకూ మా యింట్లోనే వుంచుకొని చదువు చెప్పిస్తాం! ఆ తర్వాత వెతుక్కో అక్కర్లేకుండా ఉద్యోగం వేయించే పూచీ మాది! పిల్ల ముత్యపు చిప్ప!" అని చెప్పేడు మరొక మాంవగారు — ఇది యిల్లరికానికి ఒక్కటే మెట్టు తక్కువ!

మరొకాయన పిల్లను కూడా తీసుకు వచ్చి — "తనకి ఆస్తి హద్దులు లేనంతవుంది అని, వారసులు లేరని, ఒక్కర్తే ఆడపిల్ల అని, యిల్లరికం కావాలని" చెప్పుకొచ్చేడు.

యింకొక ఆసామీ —

"ఈ కాలంలో చదువుకున్నవాళ్ళకి పెళ్లాడాలిగాని చదువులేనివారిని పెళ్లాడకూడదని! అలా ప్రోత్సహిస్తే స్త్రీ విద్య అధికమవుతుందని — తన కుమార్తె మెట్రిక్యు

 తెలిసిచేసే తప్పు 

లేవను పాసు అయిందని"- ఆమె యిటు ఎంటిదని అటువంటిదని పొగిడి, ఆమె తొలూకూ ఫొటో యిచ్చేడు.

ఇంకో ఆయన చాలా దూరంనుండి వచ్చి...ఏవేవో సంబంధాలు కలిపి, "మా పెద్దవాడికి పుచ్చుకున్నట్టే మీవాడికీ యిస్తాం!" అని సరిపోల్చి తెపారు వెళాను.

ఇలా ఎంతోమంది ఎన్నోరకాలుగా, మూల మూలలనుండి దూర దూరాలనుండి, పెళ్లికొడుకులకోసం భూతద్దాలతో రిసెర్చి చేసి వెతుక్కొని వెతుక్కొని నాకోసం వచ్చేరు! యిదంతా చూస్తే నా ఒక్కడి కోసం ఎంతమంది ఆడపిల్లలు పుట్టేసేరో? వాళ్ళ జనాభా ఎక్కువా? అనిపిస్తుంఢేది! మొత్తంమీద నా పాట మూడువేలతో ఫుల్‌స్టాంపు పెట్టబడింది. యింతవరకూ పెరగడం యీ పోటీలవల్ల నేగదా - ఒక్కడి కోసం ఎందు కింత ఎగబాకడం?

ఇలా జరుగుతూ వుండగా, మా యింట్లో కూడ చర్చలూ, ముచ్చటలూ, వాదనలూ, ఆలోచనలూ, మొదలైనాయి. నా వెల ఎక్కువవుతున్నకొద్దీ మావాళ్లకి దగ్గిర బంధువులమీద, పూర్వం మాటయిచ్చినవాళ్లమీద శ్రద్ధ సన్నగిల్ల నారంభించింది. ఎవరు ఎక్కువ కట్నం యిస్తే వాళ్ల పిల్లనే చేసుకోడంలోకి దిగింది. మూడువేలమీద మల్లు వంగినా ఆ బరువు విలువయింది కాదని వదులుకున్నారు.

నా కిదేం నచ్చలేదు - అసలు కట్నం పుచ్చుకోకూడదని నా వుద్దేశ్యం; కాని నే నేమన్నా చిన్నతనం అన్నారు. ఈ బాధ పడలేక నే పెళ్లాడనని పట్టుపట్టేను. కాని - చదువుకీ పెళ్ళికీ ముడేమిటనీ, ఏ కాలంలో జరగవలసిం దాకాలంలో జరిగి తేనే ముచ్చట అనీ, ముసిలిదయిన మా అమ్మమ్మ యిం కెన్నాళ్లో బ్రతకదనీ నా పెళ్ళి కళ్లజూసి,కళ్లు మూస్తానంటోందనీ, అడ్డుపెట్టడానికి వీల్లేదని ఎన్నెన్నో చెప్పి పెళ్లికి ఒప్పించేరు. నాకు స్వతంత్రం లేదు. దేనికీ ఎదురుచెప్పే తాహతు లేదు. ధైర్యం వున్నా మాట నెగ్గేవరకూ రాలేదు. ఏమన్నా చిన్నతనంకిందే లెఖ్క! అంతలా ఆలోచించడానికి యీడూ లేదు! అదీకాక - నాకు కూడా, అప్పుడప్పుడే, అమ్మాయిలవైపు చూడాలని, వాళ్లతో స్నేహం చెయ్యాలని, వాళ్లతో మాట్లాడాలని, చిన్న చిన్న జ్ఞానం కలుగుతూందేమో! పెళ్లాం, ఆ ముచ్చటా, ఆమె మా యింటికి రావడం, నేను పండుగులకి వాళ్లింటికి వెడుతూండడం ఎంతో ఆనందంగా గడుపవచ్చనీ, నా వూహ.. యింకా, సూటు బట్టలు లాగొచ్చు, సైకిలు, రిష్టువాచి, చిల్లరఖర్చులకి, అడపాతడపా, డబ్బూ, యింకా యిలాటి వెన్నో - చిన్నతనంలో అందరికీ సహజంగావుండే కోర్కెలన్నీ తీరాలంటే అదే దారి. అటువంటి దేదో వస్తేనే తీరుతాయి. లేకపోతే అప్పట్లో నా కోర్కెలన్నీ ఎలా తీరుతాయి? నామాట మరెక్కడా చెల్లదు. కాని అల్లుడినవగానే మావగారి దగ్గర చెల్లుతాయి. అవి చిన్నతనం కోర్కెలని ఎవరయినా అన్నా అక్కడ చిల్లర ముచ్చుల

క్రింద పోతాయి. అడగవలసినవాడు అల్లుడు. అలిగితే తీర్చేవాడు మావఁగారు. తప్పు లేదు. ఈ సరదాలన్నీ ముఖ్యంగా తీరాలంటే - పెళ్లి చేసుకోడంకంటే వేరే వుపాయం లేదు. ఇలాటి ఆలోచనల ముందర కట్నం పుచ్చుకోడఁవా? మానడఁవా? మంచిదా? కాదా? కట్నం అంటే అర్థం ఏమిటి? - యిన్ని ఆలోచనలు రావడానికి ఆలోచించడానికి, అవకాశం కలగలేదు. ఈ సరదాలకోసం పెళ్లికి ఒప్పుకుంటేనే బావుంటుందనిపించింది.

ఈ విషయంలో నేనొక్కడినే కాదు! చిన్నతనంలో కట్నాలు తీసుకొని పెళ్లాడినవాళ్లలో చాలామంది అప్పుడు తెలియక వూరుకొని ఆ తర్వాత నాలాగే విచారిస్తూ వుంటారని నా వుద్దేశ్యం - పైకి ఏమీ నోరెత్తలేరు. కొంచం ఆలోచిస్తే యీ తప్పు పెళ్ళికొడుకులది కాదు!... పెళ్లి చేసే పెద్దలది! - పెళ్లికొడుకు తల్లిదండ్రులది. విచక్షణాజ్ఞానంగలవాళ్లు, అనుభవంగలవాళ్లు వద్దనాలి! పుచ్చుకోడం మానాలి!

ఉదాహరణకి చూడూ! మా అమ్మని, ఆమె తల్లిదండ్రులు కట్నం యిచ్చే పెళ్ళి జేసేరు. అప్పుడు మా అమ్మకూడా బాధపడే వుంటుంది. యీ కట్నాలు ఇవ్వడం, పోవాలని, మంచిది కాదని ఎన్నో కుటుంబాలు దీనివల్ల గుల్ల అవుతున్నాయని, ఎంతో మంది ఆడపిల్లలు కట్నాలు యిచ్చుకోనే తాహతులేక పెళ్ళిళ్లు కాక కన్యలుగానే వుండిపోతున్నారని ఆమె అనుకోనే వుంటుంది. కాని - నేను పుట్టగానే నాకు పెళ్ళి చేసే వేళకి కట్నం పుచ్చుకుంటేనే గాని పెళ్లి చేసింది కాదు! తనలాటిదే తన కోడలు కాదూ? తన తల్లిదండ్రులు బాధ పడినట్టే తన కోడలి తల్లిదండ్రులు యిబ్బందిపడరూ? అత్తా ఒక యింటికోడలే అన్నట్టు అలా అనుభవించిన కష్టం మరిచిపోయి తామే ఆ పొరపాట్లు తిరిగి చేస్తూంటే, యీ కట్నాలు పోవాలి! పోవాలి అంటే ఎలా పోతాయి? యిప్పుడే మా శావు—యీ కమలే ఏముంది? తన కొడుక్కి కట్నం తీసుకుంటేనే గాని పెళ్ళి చెయ్యనంది. -

ఆమె కట్నం యిచ్చి - నన్ను పెళ్లాడి ఎన్నాళ్లో కాలేదు. కట్నం యిచ్చేముందు ఆమె తల్లిదండ్రులు పడ్డ యిబ్బందులు, కష్టం, దుఃఖం అంతా తనూ ఎరుగును, తనకికూడా అప్పుడు నేను కట్నం తీసుగొని తనని పెళ్లాడడం యిష్టం లేదు. - అయినా - అదంతా యింతలోనే మరిచిపోయింది. తను పెళ్ళి పెద్ద కాబోయేసరికి - తనకూ ఆశ బుట్టింది!

ఇది తప్పు కాదూ? ఇదా తను చెయ్యవలసినపని? యిలా వంశపారంపర్యంగా కట్నం పుచ్చుకోడం జరుగుతూంటే యిది పోతుందా? దీనికి ముఖ్యంగా ఆడవాళ్లే కారణం. వాళ్లకి వాళ్లే నష్టం కలుగజేసికుంటున్నారు! మీరు మిక్కిలి పైవాళ్లని అతిచులకనగా నేరం మోపి మాటాడతారు! అదీ కాక, మొగవాడు - ఇష్టం వుండో, లేకో, బలవంతాన్నో ఎలాగో కట్నం ఎప్పుడూ పుచ్చుకుంటూనే వున్నాడు... అది వాడి నిరంకుశత్వమే అనండి... డబ్బు చేదు కాదు - వాడు తండ్రిఅయినా ఇచ్చేవాడుంటే పుచ్చుకుందామనే చూస్తాడు. అందులోనూ ఇస్తాం ఇస్తాం అని వస్తూంటే, పుచ్చుకోక ఏంచేస్తాడు. మరో సంగతి. ఆడపిల్లలుంటే - నే పుచ్చుకున్నాను కదా... ఆడపిల్లకి ఇవ్వొద్దా...అని ధర్మబుద్ధితోనే ఇస్తే ఇవ్వొచ్చు. మరి అంత హక్కు ఆడదాని కున్నపుడు, ఆమెబుద్ధి ఏమయింది? ఆమె హృదయం ఏమయింది? ఆమె అనుభవం ఏమయింది? ఆమె ఎందుకు అడ్డు పెట్టకూడదు?

ఈ తల్లులెవ్వరూ అడ్డు పెట్టలేదు. మీరు మిక్కిలి ప్రోత్సహిస్తున్నారు! ఇందులో కష్టం ఆడవాళ్ళకే బాగా తెలుస్తుంది. అంతే అనుభవించినా తిరిగి తమ పిల్లలికి తామే కట్నాలు పుచ్చుకుంటూంటే యీ కట్నాల సమస్య ఎలా పోతుంది? కాబట్టి ఆడవాళ్లు తమతోటి స్త్రీలు బాగుపడాలంటే, తమ పిల్లలకి కట్నాలు పుచ్చుకోకండా, ఇవ్వకండా పెళ్ళిళ్లు చెయ్యాలి. మగవాడు పుచ్చుకుందామన్నా నయాన్ని భయాన్ని చెప్పి మానిపించి పెళ్ళి పెద్దలనిపించుకోవాలి.

ఎక్కడయినా మొగపుట్టుక పుటినవాడున్నాడంటే చాలు వెతికి వెతికి వాడిమీద పడతారు. ఎవరెంత కట్నం పాడేరో తెలుసుకొని, ఆ సంబంధం ఎక్కడ తప్పిపోతుందో అని మరో కొంత ఎక్కువ ఇస్తాం అని, ఇంకా పైని ఏవో వస్తువులు పెడతాం అని, చెప్పగుంటారు. ఒకళ్లమీద ఒకళ్ళలా పోటీలు పడడంవల్ల అవతలవాడు - నామగోత్రాలు రెండే మిగిలినవాడయినా వాడి కెక్కడలేని తాహతూ, అంతస్తూ, గొప్ప, గర్వం, దర్జా అన్నీ వచ్చేస్తాయి. ఎవరెంత ఇస్తామన్నా ఇంకా 'ఉఁహూఁ' లోనే వుంటాడు. వుండడూ? ఎవరిది తప్పు? పుంజాలు తెంపుగొని, కొంప మునిగిపోయినట్టు, మొగపురుగులు కరువయినట్టూ, అంత ఆత్రుత, అనువు, చూపుతూవుంటే! అలా అంత వేగిరపడి ఏదో ఒదుల్చుగుంటే చాలన్నట్టుగా అయిపోడానికి ఆడపిల్ల ఎందుకంత చులకన అయిపోయింది? మరి కొన్నాళ్లు పుట్టింటో వుంటేనేం? వుండడానికి ఆమెకి హక్కు లేదా? ఆమె వారిలో అంశ పంచుకొని పుట్టలేదా? అంత బరువు ఎందుకు? - తల్లిదండ్రులకి ఆడపిల్లలయినా, మొగపిల్లలయినా ఒక్కలాటి ప్రేమే వుంటుంది అంటారు! నిజమే కాని ప్రస్తుతం జరుగుతున్న విషయాలబట్టి తల్లిదండ్రులు యీ ఆడపిల్లలిని కురుపుల్లా చూస్తున్నారు. ఎంత అసహ్యమయిన మందు అయినా సరే ఆ కాస్సేపూ ఇంద్రియాలు బిగించుకొని ఆ బాధ వదిలిపోతే చాలు అన్నట్టుగా - ఎవడో 'మగవాడు' అనిపించుకున్న వాడున్నట్టయితే చాలు వాడి యితరత్రా లక్షణాలు - మర్యాదా, ఆస్తి, చదువు, ఆరోగ్యం, వయస్సు, గుణం, గౌరవం, మొదలయినవి వున్నా లేకపోయినా, వాడికి ఏదో విధాన్ని అంటగట్టి - పిల్లని వాడితో అంపకంబెట్టి 'అమ్మ నాయినా పిల్ల కాపరానికి వెళిపోయింది, సగం బరువు తీరింది' అని నిబ్బరపడుతున్నారని అనుకోడంలో పొరపాటు వుండదు. ఆ తర్వాత తమ కన్నకడుపే ఎంత బాధపడుతుందో అని ఆలోచించకండా వున్నారు. ఇంత శత్రువుగా ఆడపిల్ల ఎందుకు మారిపోయిందో ఒకప్పుడు పిలగా అనుభవించిన తల్లికి తండ్రికీ, అక్కర్లేదు. అలాగని అందరూ యిలా చేస్తున్నారని కాదు - కొందరు.

ఆఖరికి రెండు వేల అయిదందల రూపాయలకి ఒక సంబంధం నిశ్చయపర్చి నా అంగీకారంకోసం మా అమ్మ అడగవచ్చింది. నా సరదాలు తీరాలని ఎంతో కుతూహలంగా వున్నా అవి తీరాలంటే కట్నం పుచ్చుకోకండా పెళ్లిచేసుకుందికి మా అమ్మ ఒప్పుకోదని తెలిసినా కట్నంవద్దని అప్పటికీ పట్టుపట్టేను. ఇహను ఎన్ని ఆశీర్వచనాలు కావాలో అన్నీ ముట్టేయి.

కొందరు యీ కట్నాలు పుచ్చుకోడాన్ని సమర్థిస్తూ మహా విచిత్రంగా తిప్పుకుందామని చూస్తారు. కొందరికి కట్నం

(30-వ పేజీ చూడండి)



ఫొటో : సి. సీతారాం—మద్రాసు.

## ★ తెలిసి చేసే తప్పు ★

తీసుకోనకపోతే చిన్నతనమట! గౌరవానికి, తాహతుకి, మర్యాదకి, తక్కువట! అందరూ నవ్వుతారట!—

మరికొందర్ని అడిగితే—"ఆ మొగపిల్లలకి పుచ్చుకున్న కట్నంతో ఆడపిల్లల పెళ్లిళ్లు జేస్తున్నామయ్యా! మా ఆడపిల్లల్ని వుత్తినే పెళ్లాడే మహానుభావు లెవరూ లేరు! మాకేం మిగిలిపోలేదు! మేం మేమీ అది పడేసుగోని మేడలు కట్టుగోలేదు." అని వాదిస్తారు. ఇలాగే మా అమ్మకూడా ఎన్నో కారణాలు చెప్పింది -

"కట్నం మనకేం మిగిలిపోతుందట్రా! వెర్రివాడా? మరి నీ పెళ్ళికి ఖర్చవదూ? ఆ కట్నంవస్తే బొటాబొటిగా సరిపోతుంది, ఇంకా చేతిది తగలకండా వుండదు. కూడదంటే ఎక్కడనుండి డబ్బు తెస్తాం! నీ పెళ్ళి ఎలా అవుతుంది. ఆ కట్నంతోనే నీ పెళ్ళి అయిందనిపించాలి!" అంది.

"ఇది బావుంది! నా పెళ్లికి, మనకయే ఖర్చులు మనం పెట్టుకోకూడదూ? మరి పెళ్లి జరిగేది వాళ్లింటేకదా - అక్కడ పెద్దఖర్చు, ఆ ఖర్చూ ఇటు మనకయేఖర్చూ, యీ రెండూ వాళ్లొకళ్ళే భరించమనడం ధర్మమా? అదీకాక మనఖర్చులు వాళ్లకి రుద్దడం ఏమిటి? ఇదేమన్నా బావుందా?" అని అడిగేను -

"అది సరే - పోనీ, తగినట్టు పిల్లకి బంగారం మనం కొని పెట్టాలా? మరి ఆ డబ్బుతోనే కొని పెట్టాలిగాని ఇంకెక్కడనుండి వస్తుంది? మనకేం మిగిలిపోతుందా? వాళ్లపిల్లకి బంగారంకిందే - తిరిగిఇచ్చేస్తాం!" అంది.

"ఇది మరీ బావుంది! వాళ్లపిల్ల - వాళ్ళ బంగారం! దీనికి అర్థం వుందా? వెంటనే పిల్లని మనఇంటికే పంపేస్తారు. ఆ బంగారం మనదగ్గరే వుంటుంది. మనదే. అది కావలిస్తే మనం అమ్ముకోవచ్చు. పిల్లతండ్రి అమ్ముకోగలడా? అమ్మితే మనం వూరుకుంటామా? మనం అమ్మితే వాళ్ళేమీ అనలేరు! అలా ఎందరో చేసేరు చేస్తున్నారు! బంగారం మనది కాబట్టి మనడబ్బుతోనే కొని పెట్టాలి. వాళ్ళదగ్గర ఏ యీపాన్నీ పుచ్చుకోకూడదు. అదీకాక మనకిరాని సొమ్ము వాళ్ళ కెక్కడనుండి వస్తుంది? అయినా - నువ్వు బంగారం పెట్టవద్దు. వాళ్ళదగ్గర కట్నం పుచ్చుకోవద్దు - అలా పెళ్ళి చెయ్యకూడదూ!" అన్నాను.

"ఇహ నీతో వాదించలేం - చెబితే వినాలి బొత్తిగా చిన్నతనం అయితే ఎలాగు? అందరూ నీపాటి తెలియకే పుచ్చుకుంటున్నారా? తెలియకే యిస్తున్నారా? అదొక ఆచారం. ఇలాటి విషయాల్లో నిన్నడగడం నాదే తప్పు. నువ్వూ వీటిల్లో జోక్యం కలుగజేసుకోకూడదు. ఆ మూడు ముళ్లూ కట్టడం అంతవరకే నీ పని, తక్కినవన్నీ మేం జూసుకుంటాం! నువ్వు నోరుమూసుకు వూరుకో!" అని కసిరి మరి వాదించలేక - నన్ను వంచి, మరేం మాటాడ్డానికి వీల్లేకండా చేసి ఏదో ఒక సంబంధానికి ఒప్పుకోక తప్పకుండా చేసింది. కాని నేనా సంబంధం ఒప్పుకోలేదు.

పరిస్థితులన్నీ నా చేతిలోనుండి మించిపోతున్నాయి. ఇంక మిగిలింది యిష్టమయిన పిల్లని ఎంచుకోడం. అదీ జారిపోతే—అందికే మరేమీ వాదించక వూరుకున్నాను.

అని చెబుతూ చెబుతూ చంద్రం మధ్యలో ఆపేసేడు.

ఇంకా వినాలన్న తొందరతో 'మిగతాది చెప్పు!' అని నే వడిగేను.

అతను కమలవయిపు చూస్తూ...

"ఇహ చెప్పబోయేది యీమె వినకూడదు...ఆమె వుంటే చెప్పను," అన్నాడు నవ్వుతూ!

నే నేమీ అనలేక వూరుకున్నాను.

"పోనీ యీలోగా కాఫీ చెయ్యి నే పూర్తి చేసేస్తా" అని అతనే అన్నాడు.

అది విని, కోపంవచ్చి చటుక్కున లేచి ఆమె వెళ్ళిపోయింది. "యిహను చెప్పు" - అన్నాను.

'నేను కమలని చూసినపుడు చిన్న[illegible]లోనే అయినా నామనస్సు ఆమె మనస్సుతో మాటాడింది.

ఆఖరికి కమలని తప్ప మరెవ్వరినీ పెళ్లాడనని చెప్పేశాను. మాఅమ్మ కూడా మరేమీ అనకండా అక్షరాలా పదిహేనువందల రూపాయల కట్నానికి ఒప్పుగుంది. పెళ్ళి పందిట్లో ఆ శుభముహూర్తాన్ని వెండి పళ్లెంలో ఆడబ్బు గలగలా పోసేరు. తక్కిన లాంఛనాలతో సహా పెళ్లి జరిగిపోయింది.

"మాకావా అంత ప్రేమించినదాన్ని కూడా కట్నం తీసుకోకండా పెళ్లాడ లేకపోయేను..."అన్నాడు చంద్రం. ఇంతలో లోపలనుండి—

"అమ్మ బాబో..." అన్న కమలకేక వినవచ్చింది.

ఏమయిందో అని మేమిద్దరం పరుగెట్టేం. కాని—కమల నవ్వుతూ రెండుకప్పులలో కాఫీ తెస్తూంది.

"ఎందుకలా అరిచేవు!" అని అడిగేడు చంద్రం.

"—మీకవిత్వం, మీ వర్ణన,...వింటే మొహం తిరిగినట్టయింది...కొందం తేరుకున్నాను...అంతే?... యిదిగో పుచ్చుకోండి." అని నవ్వు ఆపుగోని చెబుతూ కాఫీ యిచ్చింది.

"ఎంత వెటకారంగా వుంది?...అందికే చెప్పనన్నాను..." అన్నాడు.

"పోనీ అయిపోయిందిగా కడతేర్పు" అన్నాను.

"నా పెళ్లయిపోయింతర్వాత తక్కిన బంధువులందరికీ ఎక్కడ లేని కోపాల్లూ వచ్చేయి.

మాటలు మానేసినవాళ్లు కొందరు—

'మాపిల్లకేం మొగుడు దొరక్క పోతాడా' అని కొందరు.

'ఈకట్నంపోస్తే వీడికన్నా మంచివాడే దొరుకుతాడు!' అని యింకొందరు.

'అబ్బే ఏదో చిన్నప్పుడు వూరికనే వచ్చేవాడు గాని మేం మొదటినుండి మా పిల్లని వాడికిద్దామనుకోలేదు' అని కొందరు.

"మాపిల్లకి యీడు కాదు"అనికొందరూ -

"మాపిల్ల వాడిని నచ్చిందికాదు" అని కొందరు -

ఇలా తలొకరూ తలొకలా నచ్చచెప్పుగోని, సమర్థించుగోని మనశ్శాంతిని పొందేరు.

ఇంతమంది తమపిల్లలకోసం నన్ను బేరం ఆడడం మొదలెట్టేరు. నే నేం లక్షాధికారినా! మహాపురుషుణ్ణా! నాకోసం ఎందు కింతమంది పోటీలు పడాలి? యీవిషయం ఎవరితోనన్నా అంటే "ఆడపిల్లలుంటే నీకే తెలుస్తుంది. పెళ్ళిచెయ్యడం ఎంత కష్టమో!" అంటారు. కాని యిందువల్ల నేకదా పెద్ద వాళ్ళకి ఈ కట్నాలమీద ఆశ లావయింది! ఆ వయస్సులో నే నేం చెయగలను?...యీ కారణాలన్నిటివల్లా - నేను కట్నం తీసుకొనక తప్పిందికాదు! ఏమంటావు?... చెప్పు! ఎవరిది తప్పో? నాదా? ... పెద్దవాళ్ళదా?" ★




# స్త్రీజనాభ్యుదయానికి ★ ప్రభుత్వం వారి సంస్కరణలు

పి. జయప్రదాదేవి

బి. ఏ. బి. ఇడి.

భారతప్రభుత్వం ప్రతిపాదించిన హిందూ వివాహపు చట్టంలో దాదాపు 30 క్లాజులున్నప్పటికీ, విడాకులకు సంబంధించిన క్లాజులే ముఖ్యమైనవి. విడాకులకు గల కారణాలు కోర్టుద్వారా విడిపోవుట (జుడీషియల్ సపరేషన్), విడిపోవుటకు కావలసిన కాలపరిమితి, మనోవర్తి, పిల్లలు, ఎవరిదగ్గఱ వుండాలి - అనేవి ముఖ్యంగా విడాకులకు సంబంధించిన అంశములు. వీనితోపాటు యువతీ యువకుల వివాహపు వయఃపరిమితినిగూర్చి కొన్ని క్లాజులున్నాయి. వీటన్నిటికంటే ముఖ్యమైనది వారసత్వపుబిల్లు. కాని యిది ప్యాస్ కాకుండానే పార్లమెంటుచర్చలు వాయిదా పడినవి.

## వివాహము : వయస్సు :

ఇది చాలకాలంనుండీ వివాదగ్రస్తవిషయంగానే వుండిపోయింది. బ్రిటిషువారు మన దేశాన్ని పరిపాలిస్తున్నప్పుడు పసిపిల్లల వివాహాలను నిషేధిస్తూ శారదాచట్టము ప్రవేశపెట్టారు. దీనిప్రకారం 14 సం॥ లు రానిదే బాలికలకు వివాహం చేయరాదు. పసిపిల్లల వివాహాలు విరివిగా జరుగుతున్న ఆరోజుల్లో యీచట్టం రావటం బాలికల అదృష్టమనే చెప్పాలి. కాని నేడు మనము ఇంకోఅడుగు ముందుకు వెళ్లాము. దీనికి తగినట్లుగా ప్రస్తుత చట్టంలో యువతికి 15 సం॥ లు, యువకునికి 18 సం॥ లు అని నిర్ణయించబడింది. శారదాచట్టంతో పోల్చిచూస్తే యువతికి ఒకసం॥ ము మాత్రమే పెంచబడింది.

కాని మానసిక, శారీరక శాస్త్రముల దృష్ట్యా పరికించితే ఈ వయస్సు యువతికి చాలా తక్కువ అని తోస్తుంది. ప్రస్తుత కాలంలో బాలికలు 14 వ సం॥న గాని బాల్యదశను వీడరు. తిరువాత రెండుమూడు సం॥లు గడచిన గాని శరీరము వృద్ధిచెందదు. దీనిని గమనించక 15 వ యేటనే వివాహం చేసినయెడల, మరుసటి సం॥మే పిల్లలు పుట్టటం తటస్థిస్తోంది. ఈ పరిస్థితులలో యువతి శారీరకంగా సంపూర్ణ స్థితిని పొందటానికే అవకాశము ఉండదు. ఈస్థితిలో కలిగిన సంతతి కూడ చాల బలహీనంగా వుంటుంది. దీనివలన జీవితకాలం కూడా తగ్గిపోతుంది. అంటే 35 40 సం॥ల లోపలే స్త్రీజీవితం పూర్తవుతుంది. ఇది చాలా శోచనీయమైన విషయం. కనుక యువతి వివాహవయఃపరిమితి కనీసం 16 సం॥లు వుండుట మంచిది. మనదేశము బలంగల ప్రజలను కలిగివుండాలంటే శాస్త్రరీత్యా 18 సం॥లు వుంటే చాలా మంచిది.

జీవితంగా చట్టంలో యువకులకు నిర్దేశించిన వయస్సుకూడా చాలా తక్కువ అనిపిస్తుంది. ఎన్నికలలో ప్రతి యువకునికీ 21 సం॥లు వున్నగాని ఓటు చేసే హక్కు వుండదు. అంటే అప్పటికి గాని తాను స్వయంగా మంచీ, చెడూ ఆలోచించలేడని ప్రభుత్వం అలా నిర్ణయించింది. మరి వివాహ విషయంలో 18 సం॥లు నిర్ణయించటం ఆశ్చర్యకరం. కోర్టు వ్యవహారాలకు 18 సం॥లు నిర్ణయించినప్పటికినీ, శరీరారోగ్యం, జీవనపరిమితి, మానసిక వికాసం మొదలగు విషయాలను దృష్టిలో నుంచుకొని యువకునికి 21 సం॥లు నిర్ణయించటం సముచితం.

## ★ స్త్రీజనాభ్యుదయానికి ప్రభుత్వంవారి సంస్కరణలు ★

ఇదే సందర్భంలో ఇంకొక విషయం స్ఫురిస్తుంది. పెండ్లి అయిన తరువాత కొన్ని సం॥లు సంసారము సాగించి, తరువాత కోర్టు ద్వారా భర్తలు విడాకులు తీసుకున్నారనుకొండి. అప్పటికి పురుషునికి 30 సం॥లు వయస్సు వున్నదనుకుందాం. ఆ పురుషుడు మరల వివాహం చేసుకుంటే ఎవరిని చేసుకోవాలి? అనే ప్రశ్న వుదయిస్తుంది.

ఈ సమస్య పార్లమెంటు చర్చిస్తున్నప్పుడు ఒక సభ్యుడు సూచించినదిది: "రెండవ పెళ్లి చేసుకునే పురుషుడు రెండవ పెండ్లి చేసుకునే స్త్రీనే వివాహమాడాలి."

దీనివలన చాలా చిక్కులు బయలుదేరతాయి. అలా నిర్ణయించడం సబబుగాదు. ఎందుకంటే విడాకులిచ్చే ప్రతి పురుషుడి వయస్సు 35 సం|| లుంటుందని చెప్పలేము. ఒకవేళ అంత వయస్సు వుంటే 15 సం||ల యువతిని వివాహమాడటం ఘోరము. కనుక ఇలాంటి విషయములను గూర్చి ఆలోచిస్తుంటే ఎన్నో సమస్యలుత్పన్నమౌతాయి. వీటిలో ప్రతి సమస్యకూ ఒక బిల్లు ప్యాసు చేయటం కష్టం. కనుక ప్రజలే వివేకంతో ఆలోచించి నడుచుకోవటం మంచిది, అవసరం కూడా. కాని స్త్రీ, పురుషుల వివాహవయస్సులో తేడా 5 సం||ల నుండి 10 సం||ల వరకు వుండవచ్చు. దీనికంటే ఎక్కువ వుండకూడదు. ఈ విషయాన్ని గూర్చి పై చట్టం ఏమీ చెప్పకపోవటం విచారకరం.

## విడాకులు :

భారతదేశం అనేక జాతులకు ఆలవాలం. వారి ఆచార వ్యవహారాలు కూడ భిన్నమే అయినప్పటికి విడాకులఆచారాన్ని ఇంతకు పూర్వంనుండీ 100 కి 80 మంది అనుసరిస్తూనే వున్నారు. అయితే అది మలబారులో ఒకవిధంగా, తమిళదేశంలో మరో విధంగా వుంది. ఇప్పటి చట్టంవలన భిన్న ప్రాంతాలలోని హిందువులందరూ ఒకే విధమైన సౌకర్యాన్ని పొందగలుగుతారు. అలాంటి సౌకర్యాన్ని కలుగజేసే సమయంలో యిది హిందూమతానికి వ్యతిరేకమనే సనాతనుల వాదం పసలేనిదని ఇట్టే తేలుతోంది. విడాకులకు మతం అడ్డురాదు. ఈ సదుపాయం లేకపోవుటవలన రోజూ ఆత్మహత్యలు కూడా జరుగుతున్నాయని ప్రధాని నెహ్రూ చెప్పారు.

భార్యాభర్తలకు అనేక కారణాలవలన మనసులు కలియకపోతే వారిని ఎలాగో ఒకలా జీవితాన్ని వెళ్ళదియమనటం అమానుషం. అట్టివారికి విడిపోయేహక్కు ఇవ్వటమే విడాకులచట్టం ఉద్దేశ్యం. సరిగా ఆలోచిస్తే హిందూమతమే కాదు, ఏమతమూ కూడా దీనిని త్రోసి వేయలేదు.

విడాకులకు గల కారణాలను పరిశీలించుదాం. భార్యాభర్తలలో ఒకరికి ప్రమాదకరమైన వ్యాధులుండటం విడాకులకు ఒక కారణం అవుతుంది. సుఖవ్యాధులు, కుష్టు, క్షయ మొదలగు వ్యాధులు ఈ రకానికి చెందుతాయి. ఈ వ్యాధులన్నీ ప్రస్తుతకాలంలో మందులవలన నయమయిపోతాయి గనుక, కనీసం 3 సం||ల లోపల వ్యాధిగ్రస్తుడు ఆరోగ్యాన్ని పొందగలడో లేదో చూసుకుని తరువాత విడాకులు పుచ్చుకోవాలని కొందరు వాదించారు. వైద్యశాస్త్రం అభివృద్ధియినమాట వాస్తవమే. కాని మనదేశం ఇంకా ఆ స్థాయిని అందుకోలేదు. అదిగాక వ్యాధిగ్రస్తులలో ఎక్కడో వెయ్యి మందికి ఒకరో యిద్దరో బాగుపడితే దానిని ఇక్కడ వుదహరించటం అంత సమంజసం కాదు. ఈ వ్యాధులనుండి విముక్తిని పొందే ఆర్థిక స్తోమతకూడా అందరికీ వుండదనే చెప్పాలి. కనుక విడాకులకు ఇలాంటి వ్యాధులను ఒక ముఖ్యకారణంగా గ్రహించాలి.

రెండవది: భార్యగాని, భర్తగాని యితరులతో సంబంధం కలిగివుంటేకూడ విడాకులు యిచ్చుకోవచ్చు. దీనివలన కూడ కొన్ని చిక్కులు తప్పవు. మనోనిగ్రహం, సంస్కృతీ లేని కొందరు విడాకులకోసం యిలాంటిపనులు చేయవచ్చు. కనుక కోర్టువారు ప్రతి కేసును అతిజాగ్రతతో పరిశీలించటం చాలా అవసరం.

భార్యాభర్తలలో భర్త నపుంసకుడైనా భార్య సంసార జీవితానికి అర్హురాలు కానప్పటికినీకూడా విడాకులు యిచ్చుకోవచ్చు. భార్యాభర్తలలో ఎవరైనా ఒకరు కొన్ని సం||లు కనుపించకుండా వెళ్ళిపోతే కూడా విడాకులు తీసుకోవచ్చు. ఇవన్నీ స్పష్టంగా బయటకు కన్పించే కారణాలు. కనుపించని కారణాలు అనేకం వుంటాయి. అవి భార్యాభర్తల మనస్సులు కలియకపోవటము వలన ఉద్భవిస్తుంటాయి. వీటిని పరిశీలించటంలో కోర్టుల బాధ్యత చాలా వుంటుంది.

ఇవన్నీ ఇలా వుంచి భార్యాభర్తలు విడాకులు యిచ్చుకోవటం బహుకష్టసాధ్యం. మొదట వారు కోర్టుకు వెళ్లాలి. కోర్టువారు విచారించాలి. భార్యాభర్తలు 7 సం||లు విడిగా సంసార జీవితాన్ని వదలివున్నారని కోర్టు తెలిస్తేనే గాని విడాకులకు వారు అనుమతించరు. దీనివలన స్త్రీ రెండు సార్లు కోర్టుకు వెళ్ళవలసివుంటుంది. అదీగాక ఈ కోర్టు వ్యవహారాలు చాల భారతంలా కొన్నిసార్లు 7 సం||ల కంటె ఎక్కువ కాలాన్ని తీసుకుంటాయి. అప్పటికే విడాకులుతీసుకునేవారు ముసలివారవుతారు. దీనివలన ఈచట్టంఉద్దేశ్యానికేదెబ్బతగులుతుంది. కనుక ఈ విడిగా వుండే కాలాన్ని 3 సం||లకు తగ్గించితే అందరికీ శ్రేయస్కరం.

విడాకులు తీసుకున్నతరువాత భర్త భార్యకు మనోవర్తి యివ్వటం, భార్య భర్తకు మనోవర్తి ఇవ్వటం అనే సమస్యకూడ వుంది. భార్య భర్తకు మనోవర్తి యిచ్చే క్లాజుమీద పార్లమెంటులో చాలా తీవ్ర వాదోపవాదాలు జరిగినాయి. స్త్రీ సభ్యులతోపాటు చాలామంది దీనిని పూర్తిగా వ్యతిరేకించారు. ఇలాంటి క్లాజు స్త్రీకి ఆర్థిక సమానతగల బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో కూడా కానరాదు. ఆర్థిక సమానత లేకుండా అన్నివిషయాలలోనూ ఎంతో వెనుకబడివున్న మన దేశంలో యీ క్లాజు వుండటం హాస్యాస్పదం. స్త్రీలకు వారసత్వపు హక్కు లభించిన తరువాత, స్త్రీలు ఆ హక్కును సవ్యంగా అనుభవిస్తున్నారని రూఢి అయిన తరువాత దీనిని అవసరమైతే అప్పుడు అమలులో పెట్టవచ్చు. ప్రభుత్వంవారు దీని విషయం తప్పక ఆలోచిస్తామని చెప్పటం ముదావహం. భర్తమాత్రం భార్యకు తప్పక మనోవర్తి ఇవ్వవలసివుంది. భార్య పవిత్ర జీవితాన్ని గడుపుతుంటేనే ఈ మనోవర్తి ఇవ్వాలని ఈ క్లాజులో సూచించారు. కాని మనోవర్తి ఎగవేయటానికి భార్య సచ్ఛీల అయినప్పటికిని వ్యభిచారాన్ని అంటగట్టే ప్రమాదముంది. కనుక ఈ క్లాజును కూడా తీసివేయటం మంచిది. కాని ఆ స్త్రీ పునర్వివాహం చేసుకుంటే మనోవర్తి ఇవ్వనవసరం లేదు.

తరువాత వీరికి పుట్టిన సంతతినిగూర్చి మరికొన్ని క్లాజులున్నాయి. ఈ సంతానం ఎవరెవద్ద వుండాలి అనేది మరో సమస్య. పిల్లల భవిష్యత్తు కోర్టే నిర్ణయిస్తుందని ఈ చట్టంలో వుంది. అయినప్పటికినీ పిల్లల మనస్తత్వం స్త్రీలకే చక్కగా బోధపడుతుంది. వారిని మృదువుగా ఆలించి లాలించి పెంచగల సహనం స్త్రీకి మాత్రమే వుంటుందనేది నూటికి నూరుపాళ్లు సత్యం. కనుక కనీసం 12 సం||ల వయస్సు వచ్చేవరకైనా పిల్లలను తల్లివద్దనే వుంచటం శ్రేయస్కరం. ఈ బాధ్యతను ఏ తల్లీ నిరాకరించదు. ఒకవేళ నిరాకరించితే ఆ పిల్లలను ప్రభుత్వం సంరక్షించవలసివుంటుంది. ఈ క్లాజుద్వారా ఆస్తిలో తగినవాటా పిల్లలకు సంక్రమిస్తుంది.

ఇన్ని సౌకర్యాలున్నప్పటికినీ, అనేక సంవత్సరాలనుండీ స్త్రీ ఇంటిలోపలే వుండటానికి అలవాటుపడివున్నది కనుక వెంటనే ధైర్యంగా కోర్టుకు వచ్చి విడాకులను కోరలేదు. పరువు మర్యాదలు పోతాయనే భయం వుంటుంది. కనుక ఈ వ్యవహారమంతా కోర్టులలో రహస్యంగా జరిపించటము అవసరం. అలా జరిగితే స్త్రీ తన కష్టస్థితినుండి విముక్తిపొందటము తేలికవుతుంది. అంతేగాక వీటిని పత్రికలలో



# స్త్రీజనాభ్యుదయానికి ప్రభుత్వంవారి సంస్కరణలు



కూడా అవసరమైనదానికంటే ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చి ప్రచురించరాదు. ఫలానావారు విడాకులు యిచ్చుకున్నారనే వార్త మినహా వాటి కారణాలు పత్రికలలో ప్రచురించటము అనవసరం.

## వారసత్వపు బిల్లు:

ఇది అన్నిటికంటే ముఖ్యమైనది. కుమారునితో పాటు కుమార్తెకుగూడ తండ్రి ఆస్తిలో (కుటుంబపు ఆస్తి) సరిసమాన వాటా రావటం దీనిలోని విశేషం. స్త్రీ ఆస్తివారసత్వంవల్ల వచ్చినదైనా, మరొక విధంగా లభించినదైనా అట్టి ఆస్తిపై స్త్రీకి సర్వహక్కులు ఈబిల్లు కలిగిస్తుంది. ఇది మరొకవిశేషం. కాని తండ్రిఆస్తిలో కుమారునివాటాలో సగంమాత్రమే కుమార్తెకు యివ్వాలని రావుకమిటీ సూచించింది. హిందూ కోడ్ బిల్లును పరిశీలించిన సెలక్టు కమిటీ సరిసమానవాటా వుండాలని సూచించింది. దీనివిషయంపై అధికంగా చర్చించటం అనవసరం. అసలు యీ బిల్లు వుద్దేశ్యం పురుషులతోపాటు స్త్రీలను సమానం చేయాలనేగదా! అలాంటప్పుడు స్త్రీకి సరిసమానవాటా తప్పక యివ్వాలి.

ఈ బిల్లు స్త్రీలందరికీ వర్తించవలసి వుంటుంది. దీనిలోనుండి మితాక్షరన్యాయం వర్తించే సమిష్టికుటుంబాలను మినహాయించాలనే సూచన దారుణమైనది. వీటిని మినహాయిస్తే దాదాపు 100 కి 80 మంది స్త్రీలు ఈ లాభాన్ని పొందలేరనే చెప్పవచ్చు. కాన సెలక్టు కమిటీ వీటిని తప్పక పరిశీలించి భారత స్త్రీలందరికి ఈ బిలు వర్తించేటట్లు చేయవలసిన అవసరం ఎంతో వుంది.

పై బిల్లుల బాగోగులనుగూర్చి చర్చించాం. ఈ బిల్లులలో తీవ్రమైన లోపాలున్నప్పటికిని మొత్తంమీద అభ్యుదయకరమైన బిల్లు అనే చెప్పాలి. కనుక మహిళాలోకం అంతా దీనిని సమర్థించాలి.

స్త్రీలను ఆటవస్తువుగా భావించటము మన దేశంలోనే కాదు. ఇతర దేశాల్లో కూడ వుండేది. మన పొరుగు దేశమైన చైనాలో స్త్రీల పాదాలు పెరగకుండా చిన్నతనంలోనే కట్టేసేవారు. పాదం పెద్దదిగా వుండటం స్త్రీలకు అందంకాదని వారి భావన. ఆ స్త్రీలు సరిగ్గా నడవగలిగేవారే కాదు. కాని నవచైనా ప్రభుత్వంవారు అనేక నూత్న సంస్కరణలు చేశారు. అన్ని రంగాలలోనూ స్త్రీలకు సమాన హక్కులు కల్గించారు. ఇప్పుడు చాలా పెద్దపెద్ద వుద్యోగాలలోను, యితర రంగాలలోనూ స్త్రీలు పనిజేస్తున్నారు. కళాశాలలో కూడా పురుషులతోపాటు సమానంగా స్త్రీలు విద్యనభ్యసిస్తున్నారంటే మనము ఆశ్చర్యపడనవసరంలేదు. వారి హక్కులన్నీ తు. చ. తప్పకుండా అమలు జరుపబడ్డాయి.

అదేవిధంగా మన దేశం కూడా పురోగమించడానికి స్త్రీలు విజ్ఞానాన్ని ఆర్జించాలి స్త్రీల విజ్ఞానాన్ని వృద్ధిచేయటానికి ప్రభుత్వం శ్రద్ధవహించాలి. స్త్రీలకుకూడ వయోజన విద్య గరపటం, ఒక్కొక్క జిల్లాకు కనీసం ఒక్కొక్క స్త్రీల కళాశాలను ప్రత్యేకించటం, అన్ని వుద్యోగాలలోనూ సరియైన ప్రాతినిధ్యం యివ్వటం-ఇలాంటివి ఎన్నో ప్రభుత్వం చేయవలసి వుంది.

ఈ సౌకర్యాలు చేయకపోతే పూర్వం శారదాచట్టానికి పట్టిన దుర్గతే వీటికీ పడుతుంది. వీటిని ఆచరణకు రానీయకుండా సనాతనులు అనేక విధాల ప్రయత్నిస్తారు. కనుక దీనిని సవ్యంగా అమలు జరిపించటానికి ప్రభుత్వమే గాకుండా అన్ని రాజకీయపక్షాలు శాయశక్తులా కృషి చేయాలి. అలా చేయనిచో మన దేశనాయకులు ఉద్దేశించిన సోషలిజమును స్థాపించటము కష్టసాధ్యమౌతుంది. ఈ సోషలిష్టు నినాదాలను నినాదాల రూపంలోనే వదలకుండా ఆచరణలో పెట్టి వాటి విలువను సార్థకం చేయాలంటే ఇలాంటిసంస్కరణలు అమలు జరిగేటట్లు అందరూ చూడాలి.

సాంఘికంగా ఒకదేశం అభివృద్ధి చెందినప్పుడే ఇతరవిధాల కూడా అభివృద్ధి చెందుతుంది. జనభాలో సగంవున్న స్త్రీల సాంఘికాభ్యుదయాన్ని సాధించకుండా ఏ దేశం కూడా ముందుకు వెళ్లలేదు. కనుక భారతదేశ భవిష్యత్తు ఈ సాంఘికాభివృద్ధి పైననే ఆధారపడివుంది.






# బుద్ధిలేని ఎలుక

గుంటుముక్కల మల్లిఖార్జునరావు

తల్లితోడ చెప్పె నొక్క
పిల్ల ఎలుక సంతసమున ;
"అమ్మ! చూచినాను నేను
అందమైన ఇల్లొక్కటి.

దానికి కిటికీలు రెండు,
ద్వారబంధ మొకటి గలవె.
కర్రతోడ గోడలన్ని
కట్టించిరి సొంపుగాను.

అడుగుభాగమున చెక్కలు
అమరించిరె గట్టిగాను,
కొన్ని జున్ను ముక్కలచట
కొత్త యింటిలోన గలవె.

అందు మనము కాపురమ్మ
హాయిగ ఉందాము రావె"
పిల్లమాట లాలకించి
తల్లి ఎలుక చెప్పె నిట్లు:

"అందముగానుండెనంచు
ఆశ చెందరాదె మనము.
దానియందు మోసమేదొ
దాగియుండునమ్మ! వినవె.

తలచిచూడ భయమయ్యెనె,
తోచెనద్ది బోనులాగ.
చేరబోకుమమ్మ దాని
చెంత కెపుడు పిల్లవీవు.

మనమిచ్చట నుండుటయే
మేలుకలుగునమ్మ మనకు"
తల్లిమాట లాలకించి
పిల్ల ఎలుక తలచెనిట్లు.

"అమ్మమాట లన్ని గూడ
అబద్ధాలుగా నున్నవి
అమ్మనిదుర చెందగానె, నే
నరిగెద నాయింటిలోకి."

రాత్రివచ్చె, తల్లి ఎలుక
నిదురబోయె నింటియందు.
పిల్ల ఎలుక దీనిగాంచి
మెల్లనరిగె బోనుదరికి

జున్నుముక్క కాశజెంది
జొరబడెనా బోనునందు.
వచ్చుదారిగానలేక
వగచెనపుడు తల్లిదలచి

పెద్దవారి మాటలెపుడు
పెడచెవిబెట్టంగరాదు
తల్లిమాట వినకుండిన
పిల్ల ఎలుకరీతియగును.




# కుందేలు - తాబేలు

శరవేగమును మించి
పరుగెత్తు కుందేలు,
అడుగులో అడుగుతో
తడబడెడు తాబేలు

పరుగులో తమ కేరు
సరివారు లేరనుచు
ఉబుసుపోకకు పందె
మొకసారి వైచినవి!

ఈ చివరనుండి అటు
ఆ చివరవరకు వన
పథమందు శీఘ్రముగ
పరుగిడినవారె ఈ

పందెమందున గెలుపు
పొందినట్లగు ననెడు
బాసతో నవిరెండు
పరుగెత్త సాగినవి.

కుందేలు రభసమున
కొంతదూరము పోయి,
ఆయాసమున తరు
చ్ఛాయలో నాగినది.

"ఇంతలో తాబేలు
ఎచటి కేగునులెమ్ము.
కొంత సేపిచట వి
శ్రాంతి గైకొందు"నని

కుందేలు భావించి
కునుకు తీయుచునుండె.
తాబేలు మాత్రమే
తడబడుచు నడచినది.

దినకరుడు పశ్చిమా
ద్రిని దరిసె మెల మెల్ల.
తెరలు తెరలుగ ఇరులు
పరచుకొనె దెసలెల్ల.

ఈసప్ కథలు :8

నండూరి రామమోహనరావు

బారుగ బలాకములు
చేరెను కులాయములు.
దర్జాల సింహములు
గర్జిలుచు మేల్కొనెను.

అంత నా కుందేలు
చింతనొందుచు లేచి
చిటికెలోపల నడచి
చివర వర కురికినది.

చేరిచూడగ నచట
తీరుబాటుగ సేద
దీర్చుకొను తాబేలు
కూర్చుండి యుండినది.

తాబేల్కు కుందేలు
దరికేగి "మిత్రమా!
పందెమే మాయె" నని
పరియాచకమ్మాడె.

కార్యదీక్షను బూని
కమఠమ్ము గెలిచినది.
బద్ధకించిన శశము
భంగపా టొందినది.






## 18

లోపలికిపోయిన బ్రోగార్డును మళ్ళీ పిలవబోతుంటే మార్గరెట్‌ను సర్ ఆండ్రూ వారించాడు. "వాడి దారిన వాడిని పోనివ్వటం మంచిది. మనము ఇంకాఇంకా అడిగినకొద్దీ, వాడికి మనమీద అనుమానం కలగవచ్చును. పైగా ఈదిక్కు - దిశమాలినచోట ఎవరైనా గూఢచారులున్నా ఉండవచ్చు."

"మరేం ఫరవాలేదు. ఆయన క్షేమంగా ఉండటమే నాకుకావలిసింది. ఆయనరాగానే ఉన్నసంగతి అంతాచెప్పేద్దాం." అన్నది మార్గరెట్. సంతోషంతో, ఉల్లాసంగా మార్గరెట్ ఈమాటలు కాస్త పెద్దగాచెప్పింది. సర్ ఆండ్రూ ఉలిక్కిపడ్డాడు. "ఇశ్! మెల్లిగా! మెల్లిగా! గోడలకు చెవులుంటాయి. ఉంటాయికాదు - ఉన్నాయి ఫ్రాన్సులో" అన్నాడు.

కూర్చున్న చోటునుండిలేచి, ఆండ్రూ బ్రోగార్డు ఏమయినా తలుపు వెనకఉండి పొంచి వింటున్నాడేమోనని చూసివచ్చాడు. ఆపుణ్యాత్ముడికి అంత కర్మపట్టలేదు. లోపల ఎక్కడో ఎవరినో చీదరించుకుంటూ పడి ఉన్నాడు. అక్కడినుండి ఆండ్రూ ఆ వంకర టింకర కొయ్యమెట్లదగ్గరకుపోయి, పైన గదిదగ్గర ఎక్కడైనా షావలిన్ భటులున్నారేమో పరీక్షచేసివచ్చాడు.

"ఏమండీ సేవకుడుగారు! చెవులు కనిపించినాయా?" అని మార్గరెట్ నవ్వుతూ ప్రశ్నించింది.

"మీకు పుణ్యముంటుంది. కొంచెం మెల్లిగా, జాగ్రత్తగా మాట్లాడుదురూ!" అని ఆండ్రూ బ్రతిమాలాడు.

"ఇంకా ఎందుకయ్యా స్వామీ నీభయం? నా మట్టుకు నాకు బలేహుషారుగా ఉన్నది. అవతల నా నావ సిద్ధంగా వున్నది. ఇప్పుడో ఇంకా కొంచెంసేపటికో సర్ పెర్సీ ఇక్కడికి వస్తారు. ఇంకేమిటిభయం? షావలిన్, అతడిముఠా ఇంతవరకు రానేలేదు. వారు వచ్చేసరికల్లా మనం మళ్లీ నావ ఎక్కేస్తాం. తెలిసిందీ? టా! టా!"

"మీకు తెలియదు. అంత తేలికగా జరగదు పని."

"ఏం? ఎందుచేతట?"

"మనము డోవరులో ఉన్నప్పుడు, అతడూ అక్కడే ఉన్నాడు."

"తుపాను వలన ప్రయాణం ఆగిపోవటం చేత--"

"అవును. మీరు భయపడిపోతారని, నేను మీకు చెప్పలేదు. మనము నావ ఎక్కటానికి సరిగ్గా అయిదునిమిషాలముందు, అతనిని తీరందగ్గరచూశాను. వేషం మార్చేశాడు. అయితేనేమి, నేను పోల్చేశాను. మతాధికారి వేషంలోఉన్నాడు. తనను ఎవరు ముందు కలే చేర్చగలరో తేల్చుకుంటూ బేరాలాడుతున్నాడు. మనముబయలుదేరిన అరగంటలో అతడూ బయలుదేరి ఉండాలి."

మార్గరెట్ ముఖంలో ఉత్సాహం మాసిపోయింది. తెల్లగా ముఖంపాలిపోంది. షావలిన్ ఫ్రాన్సు చేరుతున్నాడు; పెర్సీ ఫ్రాన్సులోఉన్నాడు. ఈ గడ్డ

మీద పావలిన్‌కు అధికారం ఉన్నది. అంగబలం ఉన్నది. పావలిన్ కనుబొమలు ఎగరేసి సైగచేస్తే చాలు. పెర్సీ ఏమైనా అయిపోతాడు. ఎంతప్రమాదం?

మార్గరెట్‌కు శరీరంలో నెత్తురు గడ్డకట్టిపోతున్నట్లు అనిపించింది. భయంతో, సందేహంతో, ఆందోళనతో, తాను లండనులోఉన్నప్పుడు కూడా ప్రమాదం ఇంతభయంకరంగా ఉంటుందని తట్టలేదు. ఇన్నాళ్ళనుండీ పింపర్నల్ ఎవరో ఎవరికి తెలియకపోవటం అతనికి శ్రీరామరక్షగాఉన్నది. ఇప్పుడు తాను స్వయంగా ఆయన ఆచూకీ, ఆయన ప్రబల శత్రువుకు ఇచ్చింది.

ఫిషర్ మన్స్ రెస్ట్‌లో టోనీని, ఆండ్రూను పట్టుకొని వారిదగ్గర సంపాదించిన కాగితాలనుబట్టి, పావలిన్ స్కార్లెట్ పింపర్నల్ తయారుచేసిన పథకమంతా గ్రహించాడు. అర్మండ్ సెంట్ జస్ట్, కౌంట్ డి టూర్నే తక్కిన ప్రభువులు అందరూ ఈ అక్టోబరు-2వ తేదీరాత్రి బ్లాంబార్డ్ శిథిలకుటీరం దగ్గరకువచ్చి, అక్కడినుండి ఇంగ్లాండు చేరే ప్రయత్నం చేస్తారు. ఈ కుటీరం సంగతి పింపర్నల్ అనుచరులకు అందరికి తెలుసు.

వారంరోజులక్రితం అర్మండ్ ఈరహస్య కార్యక్రమం నడిపించటానికిగాను కెలేవచ్చాడు. ఆ ప్రభువంశీకుల నందరిని జాగ్రత్తగా వెంటబెట్టుకువచ్చి అక్కడికే చేరతాడు. పావలిన్ స్వయంగా ఈవివరాలు ఆమెతో చెప్పాడు.

ఇప్పుడు అంతా ఆలస్యమైపోయింది. తన పథకం కాస్తా బయట పడిపోయిందన్న సంగతి పెర్సీకి తెలిసినా, ఈ ఏర్పాట్లు ఇప్పటికిప్పుడు మార్చటమెలా కుదురుతుంది? అర్మండ్‌కు, ప్రభువంశీకులకు ఈ సంగతి ఏమితెలుసు? పాపం, వారు తమకుగాని, తమ రక్షకునికిగాని వచ్చినప్రమాదం తెలియనందున, అక్కడకువచ్చి కనిపెట్టుకొని ఉంటారు.

పెర్సీ బ్లాకెనీ నరిమైధీరుడు ఉదాత్త స్వభావుడు కనుక తన అనుచరుడుగాని, ప్రభువంశీకులుగాని పావలిన్ కిరాతకుడిచేతులలో చిక్కటానికి అంగీకరించలేదు. అందుచేత స్వయంగా తానేబయలుదేరి కెలే పోతున్నట్లు గ్రెన్విల్ విందులో అందరు అనుచరులకు తెలిపి, హడావిడిగా బయలుదేరివెళ్లాడు.

పెర్సీ బ్లాకెనీయే పింపర్నల్ అని తెలుసుకున్న పావలిన్ పెర్సీని వెంబడించి శిథిల కుటీరానికిచేరి, అక్కడ అందరిని కలవేసి పట్టుకుంటాడు.

పావలిన్‌కూడా కెలేవస్తున్నాడు. అతడు వచ్చేలోగా తాము పెర్సీనికలుసుకొని, "ఎందుకు వచ్చినగొడవ ఇదంతా? తన్ను మాలిన ధర్మమా?" అని నచ్చచెప్పి తిరుగుప్రయాణం కట్టించవచ్చు. పావలిన్ ఒక అరగంటలో వస్తాడు. ఆలోపుగానే పెర్సీని కలుసుకోవాలి.

"పావలిన్‌కు ఈ హోటలుపేరు అదీ తెలుసు. అందుచేత కెలేలో కాలుపెట్టగానే సరాసరి ఇక్కడికే వస్తాడు." అన్నాడు ఆండ్రూ.

"ఇంతవరకు రాలేదుగా! అతడు రావటానికి ఇంకా వ్యవధానండున్నది. ఈలోగా పెర్సీ ఎటూ వస్తాడు. పావలిన్ ఇక్కడికిచేరేసరికి మనం సగం దూరంపోనేపోతాం." మార్గరెట్ ఆదుర్దాగా మాట్లాడింది. బెదిరిపోతున్న హృదయాన్ని పదిలపరుచుకుంటూ, ఆశగామాట్లాడింది. ఆ మాటలలో అలా జరుగుతుందనే ఆశకంటే, జరిగితే బాగుండుననేకోరికే ఎక్కువగాఉన్నది. కాని ఆండ్రూ విచారంగా తల అడ్డంగా తిప్పాడు.

"ఏం? మాట్లాడవేం?" అన్నది మార్గరెట్. "తల అడ్డంగా త్రిప్పావేమిటి?"

"మీరు బ్రహ్మాండమైన పథకాలు తయారుచేస్తున్నారు. కాని అన్నింటికి ముఖ్యమైన ఆటంకం ఒకటిఉన్నమాట మరిచిపోతున్నారు."

"ఏమిటి ఆ ఆటకం? నేనేమీ మరిచిపోలేదే?"

"ఆరడుగుల ఎత్తునఉన్నది. పేరు సర్ పెర్సీ బ్లాకెనీ."

"ఏమిటి నీవనేది? నాకు బోధపడటంలేదు."

"ఏమున్నది? తాను చెయ్యదలుచుకున్న పని, చేస్తానని మాటయిచ్చినపని, అంతా మధ్యలో వదిలేసి పెర్సీ తిరిగి ఇంటికివస్తారని మీకేమయినా ఆశగా ఉన్నదా?"

"అంటే..."

"కౌంట్-డి-టూర్నే, అర్మండ్ సెంట్ జస్ట్"

"అర్మండ్! అర్మండ్...! అయ్యో భగవంతుడా! ఇందాకటినుండి ఆమాటే మరిచి పోయినానేమిటి?" అంటూ మార్గరెట్ వెక్కి, వెక్కి ఏడవటం ఆరభించింది.

"నిరాశ్రయులైన ఆ ప్రభువులు — పింపర్నల్ పైన విశ్వాసముంచి, తమను ఇంకా వచ్చి రక్షిస్తాడు, ఇంకావచ్చి రక్షిస్తాడు అని ఆశలు పెట్టుకొనిఉన్న ఆ

ప్రభువులు, వారిని నమ్మించి ద్రోహం చెయ్యటానికి పెర్సీ అంగీకరిస్తారని మీ ఉద్దేశ్యమా?"

నిజమే! ఈ మాట ఆమెకు స్ఫురించనేలేదు. పెర్సీ తప్ప కడమ ప్రపంచంగురించిన ఆలోచనే లేక పోయింది ఇంతవరకు ఆమెకు.

"తనయందు నమ్మకం ఉంచినవారిని, తన పైన ఆశలుపెట్టుకొన్న వారిని నట్టేటముంచే వాడయితే సర్ పెర్సీబ్లాకెనీ ఇరవైమంది ఇంగ్లీషువారికి నాయకుడెలా అయ్యేవాడు? ఆయన అటువంటిపని చేస్తాడనుకోవటం కంటే పొరపాటు ఇంకొకటిలేదు."

ఒకటి రెండు నిమిషాలసేపు ఎవ్వరూ మాట్లాడ లేదు. ముఖం రెండుచేతులతోను కప్పుకొని, కన్నీరు కార్చసాగింది మార్గరెట్. సర్ పెర్సీసంగతి ఆండ్రూకు బాగా తెలుసు. తన ప్రాణాన్ని లెక్కచెయ్యకుండా పెర్సీ ప్రయత్నంచేసి తీరతాడు.

మార్గరెట్ తలఎత్తింది. కన్నీరు తుడుచు కున్నది. "ఆండ్రూ! నీవుచెప్పినదినిజం. నేను పొరపాటు పడ్డాను. నా భర్తచాలా గొప్పవ్యక్తి. ఆయన తన విధి నిర్వహణం చేసితీరాలి. నేను అడ్డురాను. కాని ఒక్కటే కోరుకుంటున్నాను. తన శత్రువులను ఓడించటానికి, తనప్రయత్నంలో విజయంపొందటానికి కావలసినబలం, ధైర్యం సామర్థ్యం భగవంతుడు ఆయనకు ప్రసాదించాలి. ఈ మహత్కార్యంలో మీ యిద్దరికి విజయం చేకూరాలని ఆకాంక్షిస్తున్నాను. షావలిన్ ఫ్రాన్స వచ్చేస్తున్నాడని, తన్ను వెంబడించబోతున్నాడని పెర్సీకి తెలిస్తే బాగుంటుంది."

ఆండ్రూ ఉప్పొంగి పోయినాడు. "అవును ముందుగా ఆసంగతితెలిస్తే జాగ్రత్తగా ఉంటాడు ఆయన తెలివితేటలు అమోఘమైనవి. మనము భయపడివలసిన పనిలేదు" అన్నాడు.

"అందుకని, నీవుపోయి ఆయన ఎక్కడ ఉన్నాడో వెతికి, ఈ సంగతి తెలుపు. నేను మీ యిద్దరి కోసం కనిపెట్టుకొని కూర్చుంటాను ఇక్కడే. నీవు కూడా ఇక్కడే ఆయన వచ్చేదాకా ఉంటే, పోలేదు కాలం వృథా అయిపోతుంది."

"నిజం కాని ఈ హోటులో మిమ్మల్ని ఒక్క దాన్ని విడిచిపెట్టిపోవటం నాకు ఇష్టంలేదు."

"నా కేంభయములేదు పోవయ్యా స్వామీ! మన బ్రోగార్డు నాకు ఏదయినా ఒకగది వేరే ఇస్తాడేమో కనుక్కో ఎవరికంట పడకుండా దాక్కొనిఉంటాను."

మార్గరెట్ నిబ్బరంగాచెప్పింది. మునుపటి ఆందోళనగాని, భయంగానిలేదు.

ఆండ్రూ ఇక ఎదురుచెప్పలేదు. బ్రోగార్డును పిలిచాడు. యథాప్రకారం విసుక్కుంటూ బ్రోగార్డ్ వచ్చాడు.

"ఏమయ్యా! మా అమ్మగారు కాస్సేపు విశ్రాంతి తీసుకోవాలను కుంటున్నారు. ఇంకోగది ఏదయినా ఉన్నదంటావా?" అని అడిగాడు. అంటూ కొంతడబ్బుతీసి గలగలలాడించాడు. బ్రోగార్డ్ పద్ధతి కొంచెంమారింది. ఈసారి కొంతముందుగానే తెమిలి సమాధానంచెప్పాడు. అవును మరి డబ్బుప్రభావం! నోటిలోనిపైపుతీసి చేతిలోపట్టుకొని, ముందుకువచ్చి, కొయ్యమెట్లపైనఉన్న అటకగది చూపించాడు. "అదే ఖాళీగాఉన్నది. కావలంటే అక్కడఉండవచ్చు." నని చెప్పాడు.

"ఆ గదిఅయితే చాలా ఉపయోగకరంగా ఉంటుంది. సరేనను" అన్నది మార్గరెట్ ఇంగ్లీషులో. అక్కడ గది ఉన్నదన్న సంగతి చప్పన తెలియదు. తానుమాత్రం అక్కడఉండి క్రిందఏమి జరుగుతున్నదో చూస్తూఉండవచ్చును." ఆ డబ్బువాడికి ఇవ్వవే! నేను అక్కడకూర్చుంటే ఎవరికి కనబడకుండా ఏమి జరుగు తున్నదో గమనించవచ్చు" అన్నది. సమ్మతి తెలు పుతూ, బ్రోగార్డ్‌కు అర్థమయ్యేటట్లు, తల ఊపింది.

బ్రోగార్డు తనకు ఆ డబ్బు దక్కే యోగం ఉన్నందుకు సంతోషిస్తూ పైకిఎక్కి అక్కడ శుభ్రంగాదులిపి, మెత్తగా కూర్చొనేటందుకు గడ్డి దులిపి పరిచివచ్చాడు.

ఈలోగా ఆండ్రూ ఆమెతో అన్నాడు. "నేను అలా వెళ్ళివస్తాను. మీరు మాత్రం తొందరపడి ఏపనీ చెయ్యకండి."

"అలాగే" అని తలఊపుతూ మార్గరెట్ మెట్లు ఎక్కసాగింది.

"ఇక్కడ గూఢచారులు పుట్టపగిలినట్లు ఉంటా రని మాత్రం మరిచిపోవద్దు. సర్ పెర్సీ వచ్చినా, వేరే

ఎవ్వరూ లేరని గట్టిగా నిశ్చయం అయితే తప్ప కలుగజేసుకోవద్దు."

ఏదో చెప్పాలి కాబట్టి చెప్పాడు కాని మార్గరెట్ జాగ్రత్తగానే ఉంటుందని, నిబ్బరంగా ప్రవర్తిస్తుందని ఆండ్రూకు విశ్వాసం కలిగింది. కనుకనే ఆమెను విడిచి పెట్టిపోవటానికి ఒప్పుకున్నాడు:

"అలాగే! పెర్సీ ప్రాణానికిగాని, మన కార్యానికిగాని భంగం కలిగేటట్లు ప్రవర్తించనని నీకు హామీ ఇస్తున్నాను. సమయం చూసి ఎలా చేస్తే బాగుంటుందో అలా చేస్తాను. సరేనా?" అన్నది.

"ఒక అరగంటలో గనుక సర్ పెర్సీ కనిపించక పోతే, మళ్ళీ ఇక్కడికి వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను."

"అంతే ఒక అరగంట సేపు. అంతకంటె ఎక్కువ సేపు చెయ్యకూడదు. ఆ పాటికల్లా పావలిన్ వచ్చేస్తాడు. అతడు వచ్చేలోగా నీవో, నేనో సర్ పెర్సీని హెచ్చరించగలిగితే... అంతా ఆ భగవంతుని దయ. పోయిరా! నాకేమీ భయం లేదు. నన్ను గురించి దిగులు వద్దు."

మార్గరెట్ ఆ మెట్లన్నీ ఎక్కి పైకిపోయింది. చోటు కావాలన్నారు. చూపించాడు. కాబట్టి తనపని తీరిపోయిందనుకున్నాడు బ్రోగార్డ్ - డబ్బు పుచ్చుకొని లోపలికిపోయినాడు. అంతా వసతిగానే ఉన్నదని తెలుసుకొని, ఆండ్రూ మెల్లిగా బయటికిపోయినాడు.

## 19

పావుగంటసేపు గడిచింది. ఈ పావుగంటసేపు కాలం పరిగెత్తుకు పోతున్నట్లే అనిపించింది. క్రిందగదిలో బ్రోగార్డ్ పనిమీదఉన్నాడు. టేబిలు శుభ్రంగాతుడిచి, మళ్ళీ కొత్తవారికి సిద్ధంచేస్తున్నాడు.

బ్రోగార్డ్ చేస్తూఉన్నదంతా చూస్తూ కూర్చో వటంవలననే మార్గరెట్‌కు బాగా పొద్దుపోయింది. అతడు చేస్తున్న ఏర్పాట్లన్నీ సర్ పెర్సీకోసమే నని ఆమె గ్రహించింది. ఆ పొడుగాటి ఇంగ్లీష్‌ఆయన "తలకు మాసిన" ఇంగ్లీష్‌వాడే అయినప్పటికీ, బ్రోగార్డుకు అతనిమీద భక్తిగౌరవాలు లేకపోలేదు. అందుచేత కాస్తంత శ్రద్ధగా పనిచేస్తున్నాడు.

ఒక పాతపెట్టెలోనుండి ఒక మేజాగుడ్డ కూడా పట్టుకువచ్చాడు. దానిని తీసుకువచ్చి టేబులు మీద పరుస్తున్నాడు. కాబట్టి అది మేజాగుడ్డయే అయివుం టుందని ఆమె నిశ్చయించింది. తీరా అది పరిచినప్పుడు చూస్తే, దానినిండా చిరుగులే. అదిచూసి అతడొకసారి ఆలోచనగా తలఎగరవేసి, ఆ గుడ్డఅటులాగి, ఇటులాగి సర్దిచూశాడు. ఆ చిరుగులు ఎక్కువగా కనుపించ కుండా ఉండేటట్లుచూశాడు.

అలుకుగుడ్డ కంటె చాలా నయంగా ఉండే మరొక గుడ్డతెచ్చి గ్లాసులు, స్పూనులు, ప్లేట్లు, శుభ్రంగా తుడిచి టేబులుమీదపెట్టాడు. ఇంతసేపు సణుగుడు మాత్రంమానలేదు. ఇదంతా చూస్తూఉన్న మార్గరెట్‌కు తెగనవ్వువచ్చింది.

మహాకాయుడైన ఆ ఇంగ్లీష్ పెద్దమనిషిని చూసీచూడటంలోటే బ్రోగార్డుకు అదురెత్తి పోయి ఉండాలి. లేకపోతే ఈ "తలకుమాసిన" ధనికులకోసం ఇంతస్వతంత్ర పౌరుడు ఇలా అవస్థ పడేవాడేనా?

అమర్చటమంతా అయిన తరువాత అతడు రెండడుగులు వెనక్కివేసి, తలఓరగాపెట్టి ఒకసారి అంతా పరిచూశాడు. తృప్తిపడ్డాడు. అక్కడినుండి ఒక కుర్చీతెచ్చి, దానిమీద ఉన్నదుమ్ము వీలయినంత వరకు వదిలించివేశాడు. నెగడులో మరొక రెండు పుల్లలు తగలేసి, ఆ కుండ ఒకసారికదిలించి, దక్కా లోపలికి పోయినాడు.

చిరిగిపోయిన దర్వాజా గుడ్డలోనుండి క్రిందికి చూస్తుంటే మార్గరెట్‌కు ఒకకుర్చీ, టేబిలు, ఆటేబిల్ మీదఉన్న గ్లాసులు మొదలయినవి దర్శన మిస్తు న్నాయి. అవికూడా తనకుమల్లేనే పెర్సీరాకకు ఎదురు చూస్తున్నాయి.

కొద్దినిమిషాలలో పెర్సీవస్తాడు. తాను దిగి వెళ్ళి కలుసుకుంటుంది. ఆతరువాత, కాకపోతే అతనితోటే ప్రాణాలు విడుస్తుంది.

అయినా పెర్సీవస్తేమాత్రం తానేమి చెయ్య గలదు? "షావలిన్ నీవెనకాలేఉన్నాడు. నిన్ను ఒక కంట కనిపెట్టిఉంటాడు. జాగ్రత్త!" అని హెచ్చరించ గలదు. అంతే. మళ్ళీవచ్చి పైన ఈ అటకగదిలో పడి ఉండవలసినదేకదా! సర్ పెర్సీ మళ్ళీవెళ్తాడు. తిరిగి రాగలడో లేదో తెలియదు. తానుమాత్రం ప్రాణాలు బిగపట్టుకొని, ఇక్కడకూర్చోవాలి.

ఇంతలో ఆమెకుదూరంగా ఎవరో హోటలు కేసివస్తున్నట్లు వినిపించింది. ఎవరో? దగ్గరకువస్తు న్నారు. సంతోషంతో ఆమె ఉబ్బితబ్బిబ్బైంది. "అమ్మయ్యా! సర్ పెర్సీ...... కాదు." అనుకున్నది. సర్ పెర్సీ నడకలాగా లేదు. శ్రద్ధగావిన్నది. ఒకరు కాదు. ఇద్దరువస్తున్నారు. ఎవరోఇద్దరు! బహుశా వెచ్చ వెచ్చగా ఏపానీయమో తాగిపోవటానికి ఎవరైనా వస్తుండవచ్చు.

ఆమె ఇంకాఇంకా ఊహించే వ్యవధిలేకుండానే తలుపుతట్టిన చప్పుడయింది. మరుక్షణం తలుపులు బలవంతానెట్టి లోపలికిప్రవేశించారు.

"ఏయ్! బ్రోగార్డ్! ఏమయ్యోయ్."

ఆ వచ్చినవారెవరో మార్గరెట్‌కు కనిపిచటం లేదు. బ్రోగార్డు లోపలనుండి సణుగుకుంటూ కాళ్ళీడ్చు కుంటూవచ్చాడు. గదిమధ్య నిలబడ్డాడు. ఆ భాగం మార్గరెట్‌కు కనిపిస్తుంది. బ్రోగార్డ్ క్రొత్తగా వచ్చిన వారివంక చిరాకుగాచూశాడు. చిరబురలాడాడు. "తలకు మాసిన మతాధికారులు!" అని గొణుక్కు న్నాడు.

మార్గరెట్‌గుండె కొట్టుకోవటం మానేసింది. శిలా ప్రతిమలా ఉండిపోయింది. వచ్చినవారిలో ఒకడు ముందుకువచ్చాడు. బ్రోగార్డ్‌ను సమీపించాడు. కోటుకాలరు ప్రక్కకుతీసి లోపల తానుధరించిన ఒక త్రివర్ణ పతకముచూపించాడు. అది పెద్దపెద్ద అధి

కారులుధరించేది. అది బ్రోగార్డుమీద దిట్టంగా పని చేసింది.

అతనిముఖం ఇంకా మార్గరెట్‌కు కనిపించటం లేదు. వెడల్పుగాఉన్న టోపీఅంచు అడ్డంవచ్చింది. కాని పిట్టంతమనిషిని మార్గరెట్ పోల్చుకోగలిగింది. పావలిన్!

"ఒక ప్లేట్ సూపు, ఒక వైన్‌సీసా! తెచ్చి అక్కడ పెట్టి నీవు లోపలికిపదు. నేను ఒంటరిగా కొంతపనిచూసు కోవాలి. ఏం తెలిసిందా?" అని ఉరిమాడు.

నిశ్శబ్దంగా, గొణుగుడు గిణుగుడులేకుండా బ్రోగార్డ్ చెప్పినపనిచేశాడు. ఆ పొడుగాటి ఇంగ్లీషు వానికోసం అతడుకష్టపడి అమర్చినటేబులు, కుర్చీ పావలిన్ ఆక్రమించాడు.

పావలిన్‌తో వచ్చిన మరొకవ్యక్తి మార్గరెట్‌కు అసలు కనిపించలేదు. వాకిటిదగ్గరనే నిలబడ్డాడు. బ్రోగార్డ్ లోపలికి పోయినతరువాత పావలిన్ అతనిని దగ్గరకుపిలిచాడు.

అతనినికూడా మార్గరెట్ ఎరుగును. అతడుపావలిన్‌కు కుడిచెయ్యి, కార్యదర్శి - డెజ్‌గాజ్. డెజ్‌గాజ్ నరాసరి బ్రోగార్డుపోయిన వాకిటి దగ్గరకుపోయి చెవి ఒగ్గివిన్నాడు. అత డక్కడలేడని రూఢిచేసుకొని పావలిన్ వద్దకువచ్చి నిలబడ్డాడు.

"పొంచిఉండి వింటున్నాడా?"

"లేదండి."

ఇంకాఎవరన్నా ఎక్కడన్నాఉన్నారేమో పరిశోధించిచూడమని పావలిన్ డెజ్‌గాజ్‌ను ఆజ్ఞాపిస్తాడేమోనని మార్గరెట్ భయపడింది. తన ఉనికి బయట పడితే ఏమికాను? కాని పావలిన్ పని ఒత్తిడిలో ఉన్నాడు. డెజ్‌గాజ్ తక్కినవిషయాలేవో చెప్పవలసిన తొందరలోఉన్నాడు.

"ఏమిటి చెప్పావు? ఇంగ్లీష్ నావ...?" అని అడిగాడు పావలిన్.

"సూర్యాస్తమయం అయ్యేదాకా ఎటువస్తున్నదో కనిపెట్టుతూనే ఉన్నాము. చీకటిపడటంతో దాని జాడ తెలియకుండా పోయింది. మేము చూస్తున్నప్పుడుమాత్రం అది పశ్చిమంగావచ్చి గ్రిస్‌నెజ్ చేరుతున్నది."

"సరే...! ఆఁ! కెప్టెన్‌జట్లీ ఏమంటున్నాడు?"

"గతవారం మీరు పంపించిన ఉత్తరువులన్నీ సక్రమంగా అమలు జరుపుతున్నాడు. ఈ హోటలుకు రావటానికి ఎన్నిదారులైతే ఉన్నాయో, అన్ని రోడ్ల మీద రాత్రింబవళ్లు గస్తీకాస్తున్నారు. సముద్రతీరం వెంబడి, ఆ కొండగుట్టలవెంబడి పడి మనసైనికులు ప్రతిపుట్ట, గుట్ట గాలిస్తున్నారు."

"అయితే బ్లాంబార్డు శిథిలకుటీరం ఎక్కడ ఉన్నదో జాడ తెలిసిందా?"

"ఇంకాలేదు. ఆ పేరున్నదేదీ లేదు. దాని అసలు పేరు ఇంకేదో అయిఉంటుంది......"

"ఏదోలే, మరి ఇవ్వాళ రాత్రి సంగతి ఏమిటి?"

"కెప్టెన్‌జట్లీ మీ ఉత్తరువులకోసం ఎదురు చూస్తున్నాడు. యథాప్రకారం గస్తీలు కాస్తునే ఉన్నారు."

"సరే! నీవు వెంటనే జట్లీదగ్గరకుపో! గస్తీదళాలను రెట్టింపుచెయ్యమను. ముఖ్యంగా సముద్రతీరం వెంట ఏం?"

"అలాగేనండి."

"తరువాత ఎవడయినాసరే విదేశీయుడు మన సైనికులలో ఎవరికికనిపించినా అందులోను బాగా పొడగరిఅయిన వాడుఅయితే మరీజాగ్రత్తగాను అతనిని వెంబడించాలి. కనుమరుగు కానివ్వకూడదు. అతనిని గురించినేను ఇంకాచెప్పి ప్రయోజనంఉండదు. ఎటూ అతడు మారువేషంలోనేఉంటాడు. తెలుస్తున్నదా లేదా?"

చదివే బాలలు

ఫొటో : డి. రామలింగేశ్వరరావు—మద్రాసు.

 ## స్కార్లెట్ పింపర్నెల్ 

"తెలిసిందండీ."

"ఇద్దరు అతనివెంటనేపోయి కనిపెట్టి ఉండాలి. మరొకడు తక్షణం నాగదగ్గరకువచ్చి చెప్పివేయాలి. ఒకసారి అతడు కంటబడిన తరువాత, తప్పించుకు పోనిచ్చారా, వాడి ప్రాణాలు తోడివెయ్యటమే జాగ్రత్త అనిచెప్పు ఏం?"

"అలాగేనండీ."

"సరే అయితే తొందరగాపో! x స్త్రీకి కొత్త దళాలను పంపించి మరీరా! ఆఁ! వచ్చేటప్పుడు నీవెంట ఒక అరడజనుమంది సైనికులను పట్టుకొనిరా! పదినిమిషాలకంటె ఆలస్యంచెయ్యకు పో!"

డెజ్ గాజ్ సైనికవందనంచేసి బయలుదేరాడు. పావలిన్ అతనిని మళ్ళీ వెనుకకుపిలిచాడు.

"చెప్పటం మరిచిపోయినాను. అతగాడు కుస్తీ పట్టుకుదిగుతాడేమో! ఏమైనాసరే మీరు మాత్రం అతనిని కాల్చకూడదు. మరీ తప్పకపోతే సరేసరి. అతనిని సజీవంగానే పట్టుకోవాలని నాకోరిక." అంటూ పావలిన్ ఇకిలించాడు. చేతులునలుపుకున్నాడు.

డెజ్ గాజ్ వెళ్ళిపోయినాడు.

మార్గరెట్ ఈసంభాషణ నంతటినీ శ్రద్ధగా విన్నది. డెజ్ గాజ్ వెళ్ళిపోయినతరువాత "ఇదంతా వింటూకూడా, విన్నతరువాత కూడా ప్రాణాలతోనే ఉన్నానే" అనుకున్నది.

పావలిన్ టోపీతీసి ప్రక్కనపడేశాడు. తన ప్రయత్నాలు ఇన్నాళ్ళకు సఫలం కాబోతున్నాయి కదా అన్నసంతృప్తితో ఉల్లాసంగా భోజనానికి ఉపక్రమించాడు.

పావలిన్ను చూస్తూకూర్చున్న మార్గరెట్కు ఇంతలో ఒకశబ్దం వినిపించింది. ఆమె చెవులలో మారుమ్రోగింది. ఆమె కొయ్యబారిపోయింది.

అది అంతభయం కలిగించవలసిన దేమీ కాదు. హోటలుబయట కొంచెందూరంలో ఎవరో ఉల్లాసంగా పాడుకుంటూ వస్తున్నారు. "గాడ్ సేవ్ ది కింగ్" అంటూ.

(ఇంకావుంది)

చైనా జానపదగాథ:

# నాట్యంచేసే నెమలి

[డి. మంజులత]

చాలా కాలం క్రిందట ఫూచాంగ్ నగరంలో చాలా బీద కుర్రవాడొకడున్నాడు. వాడికి ఇంటింటికీ తిరిగి అడుక్కోవటం సుతరామూ ఇష్టంలేదు. చేతిలో డబ్బులుంటే తింటం, లేకపోతే పస్తులు పడుకోవటం వాడి కలవాటయిపోయింది. వాడి దీనస్థితికి కనికరించి ఒక టీ దుకాణదారుడు ప్రతిరోజూ ఒక కప్పు టీ ఇవ్వడానికి నిశ్చయించాడు! కుర్రవాడు టీ తాగుతూ కాలం గడుపుతున్నాడు. రోజులు, నెలలు గడిచాయి.

ఒకరోజున ఆ కుర్రవాడు టీ దుకాణదారుని సమీపించి — 'బాబూ! మీరు నాకు చాలా చాలా సహాయం చేశారు! మీ మేలు మరచిపోలేను! డబ్బయితే ఇవ్వలేను, కాని ఒక పనిచేయగలను' అని కుర్రవాడు తన జేబులోనుంచి బొగ్గుముక్క ఒకటి తీసుకొని దుకాణంలోని తెల్లటి గోడ మీద ఒక అందమైన నెమలిని మూస్తాంచుగా చిత్రించాడు. అది చూడ్డానికి ప్రాణం వున్న నెమలిలాగానే కనిపిస్తున్నది. చాలా అందంగా వుంది. బొమ్మ వేసి కుర్రవాడు ఇలా చెప్పాడు:—

'అయ్యా! నేను చిత్రించిన ఈ నెమలి మీకు శుభం చేకూరుస్తుంది. మీ వ్యాపారం దినదిన ప్రవర్ధమానమవుతుంది. ఇదే నేను మీకు చేయగలిగింది.'

'బొగ్గుతో రాసిన ఈ నెమలి నాకు శుభం చేకూరుస్తుందా?' అని టీ దుకాణదారుడు కుర్రాణ్ణి ప్రశ్నించాడు.

'అవును బాబూ! మీ షాపులో తగినంతమంది మనుష్యులు కుర్చీల మీద ఆసీనులయి వున్నప్పుడు — మీరు మూడుసార్లు చప్పట్లు కొట్టండి. అయితే టీ దుకాణంలో ఒకే ఒకవ్యక్తి వున్నప్పుడుమాత్రం



నవ్వే పాపలు

ఫోటో: శ్రీ మదంపూరు జనార్దనరావు.

 

## నాట్యం చేసే నెమలి



అలా ఎప్పుడూ చేయకండి!' అని కుర్రవాడు చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రెండో రోజు దుకాణదారుడు కుర్రవాడు చెప్పింది నిజమవునో కాదో పరీక్షించేందుకుగాను- జనం కుర్చీలమీద కూర్చొనివుండగా, తను మూడుసార్లు చప్పట్లుకొట్టి వాళ్లనుకూడా అలాగే చేయమన్నాడు. అలా జరిగిన మరుక్షణాన గోడమీది బొగ్గుచిత్రం - నిజమైన నెమలిగా మారి చాలా అందంగా, చిత్రవిచిత్రంగా షాపులోని ఖాళీస్థలంలో నాట్యంచేసి అక్కడి వాళ్ళందర్నీ ఆనందంలో ముంచేసింది. అందరూ ఆశ్చర్యపడిపోయారు!

ఆరోజునుంచి ఆ టీ దుకాణానికి జనం విపరీతంగా రావటం ప్రారంభమయింది. వ్యాపారం మహా జోరుగా సాగుతోంది. జనం రావటం, యజమాని రోజుటికిమల్లే చప్పట్లు చరచటం- నెమిలి నాట్యం- ఈ వింత దేశం నలుమూలలా ప్రాకింది. దుకాణదారుడు విపరీతంగా డబ్బు సంపాయిస్తున్నాడు.

ఒక్కరోజున ఆ దేశంలో ప్రసిద్ధి పొందిన ఒక ధనవంతుడు ఈవింతను చూచేందుకు మోయగలిగినంత ధనంతో టీ దుకాణానికి వచ్చాడు. లోపలికి వచ్చేప్పటికి జనం కిటకిటలాడుతున్నారు. తనలాంటి వ్యక్తులెవరూ అక్కడ కన్పించలేదు. అందుకని ఆ సామాన్యమైన మనుషులతోపాటుగా వింత నెమిలి నాట్యం చూడ్డానికి ఇష్టపడక- యజమానిని దగ్గరకు పిలిచి ఇలా అన్నాడు -

'నే నెవరో తెలుసుగా?...నీవు కోరినంత ధనం ఇస్తాను, తీసుకో! అయితే నెమిలి నాట్యం నేను ఈ సామాన్య మానవులతో పాటు చూడలేను; నేనొంటరిగా దాన్ని తిలకించదలచాను!'

టీ దుకాణదారుడు డబ్బు సంపాయించాడు; కాని తృప్తికలగలేదు! అందుకని ధనవంతుడి మాటలు విని...మరింత ధనం సంపాయించాలనే ఆశకు లోనైనవాడు. కుర్రవాడు ప్రారంభంలో చెప్పిన మాటలేవీ అతనికి గుర్తురాలేదు!

టీ దుకాణదారుడు అందర్నీ బయటికి పంపించివేశాడు! మిగిలింది ఆ ధనవంతుడూ, అతను మోసుకొచ్చిన ధనరాసులూ, తనూ! ఆ డబ్బు జాగ్రత్త పరుచుకుని... మూడుసార్లు చప్పట్లు కొట్టాడు; ధనవంతుణ్ణి కూడా అలాగే చేయమన్నాడు!

బొగ్గు చిత్రంలోనుంచి నెమిలి రోజుటికిమల్లే కాకుండా కుంటుకుంటూ, పడుతూ లేస్తూ...హాల్లోకి వచ్చింది! హాల్లోకి వచ్చిందే గాని, నాట్యం చేయలేదు. నాట్యం చేయబోయి బొక్కబోర్లా పడింది. మరల లేచి...నాట్యంచేయకుండనే బొగ్గు రేఖాచిత్రంలో కలిసిపోయింది.

షావుకారుకు కోపం వచ్చింది. యజమాని కూడా మండిపడ్డాడు. మాటిమాటికి చప్పట్లు కొట్టారు. కాని లాభం లేకపోయింది.

ఆ సాయంత్రానికి టీ దుకాణదారుడికి అసలు విషయం గుర్తుకొచ్చింది. ఆ బీదకుర్రవాడు చెప్పిన మాటను జవదాటినందుకు ఎంతో విచారించాడు. ఆరాత్రి అతనికి నిద్రపట్టలేదు. పక్కమీద మేల్కొనే పడిఉన్నాడు.

అర్ధరాత్రివేళ ఏదో శబ్దం వినిపించింది. దుకాణదారుడికి భయమేసింది; అయినా లేచి తలుపు తెరిచాడు! బయట ఆ బీదకుర్రవాడు కొంచెం దూరంలో నిలబడివున్నాడు. ఇతన్ని చూచి ఆ కుర్రవాడు జేబులోనుంచి ఒక పిల్లనగ్రోవి తీసి నెమ్మది నెమ్మదిగా అతిశ్రావ్యంగా మ్రోగించనారంభించాడు! దుకాణదారుడు తన తప్పిదాన్ని కుర్రవాడికి చెప్పాలనుకున్నాడు; కాని సాహసించలేకపోయాడు! ఒక కారణం: పశ్చాత్తాపం వలనా, రెండు: అత్యంత మధురంగా పిల్లనగ్రోవి వాయిస్తున్న అతన్ని భంగపరచటం ఇష్టంలేకనూ! ఇలా అతను చూస్తుండగానే లోపల్నుంచి నెమిలి ఫించం విప్పి అందంగా నాట్యం చేసుకుంటూ ఆ కుర్రవాణ్ణి సమీపించింది. టీ దుకాణదారుడు తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు! మరల చూస్తుండగానే - ఆ కుర్రవాడూ, నాట్యం చేస్తూన్న నెమిలీ తన కళ్ళకు కన్పించకుండా వెళ్ళిపోయింది. ఆతరువాత ఎవరూకూడా ఆ నాట్యమాడే నెమిలినీ, ఆ బీదకుర్రవాణ్ణి చూడలేదు.



# శకునఫలం

"తల్లీ నిన్ను దలంచి ఈ కవ్య చేతన్ బూనితిన్..." బావ సరస్వతిపటం ముందునిలబడి మహా భక్తి శ్రద్ధలున్నట్టు చదివేస్తూ నన్నుచూసి ఆపేశాడు. నేను కేలండరు కాగితం చింపుతుంటే చూసి "మార్చి! ఇంక పదహారు రోజుల్లో పబ్లిక్ పరీక్షలు" అన్నాడు ఆందోళనగా!

మా బావ మార్కులని అత్తె సరు మార్కులంటారు. ఇంగ్లీషు 84½. తెలుగులో 8½... ఇట్లా ఉంటేవి వాడి మార్కులు. కాని "పక్షించే వాడు మన వాడయితే..." అన్నట్లు మా బావ మేష్టర్లంటే (డొంగ) వినయ విధేయతలు చూపేవాడు, మేష్టర్లు మావయ్య కనుసన్నలలో మెలిగే వాళ్ళు కావటం చేత, లెక్కలలో క్వార్టర్లీ పరీక్షలలో సున్నా వచ్చిన బావకి పెద్దపరీక్షలలో 36 మార్కులొచ్చాయి. అదే వరస ఎప్పుడూను!

కేలండరు మీద 'మార్చి' కన పడినప్పుడల్లా మా బావకి దడా ఒణుకూ వచ్చేవి. మార్చిలో ప్రతి రోజూ ఒక బిందెడు టీ 'స్వాహా' చేసేవాడు బావ. నేను సంవత్సరమంతా చదివేను కనుక 'మార్చి' చదువు నాకనవసరం. అందరూ నన్ను తెలివైనవాడంటారు (నేను కాదని అనుకునేను!); కనుక అదో విధమైన ధీమా! బావ పుస్తకాలు దాచేసీ, హరికేన్ లాంపులో దమురు తీసివేసీ, టీకప్పు మాయం చేసీ (అది కావలు లాభకరము. అప్పుడు బావ టీబిందె కోట కరుచుకుని తాగేవాడు. "గంటకు పది కప్పులు తాగేశ" అని నేను అనుకునే అవకాశం ఉండదు!) పని చేశాన్లే. బావ ఇంగ్లీషు పద్యాలు చూడకుండా పలకమీద వ్రాసేవాడు ఒప్పుగా రాలేదో చూద్దామని. ఒక పద్యంలో '*Be hold her Single in the field*' అని ఉంది. అందులో *Be* చెరిపేసి "బావా *Hold her single in the field*" అని రాసేత్త మతిపోయిందా!" అన్నాను.

## జ్యోత్స్న

బావ తన బొడుగుమూతిని ఇంకా ముందుకు పొడిగించాడు. ఇలాంటి గొడవలు కొల్లలు!

* * *

దుప్పటి ముసుగులోంచి తొంగి చూశాను. బావ నోరుపూర్తిగా తెరిచేసి (ఇంకా పూర్తిగా తెల్లవారలేదు, లేకపోతే ఎన్ని ఈగలు ఆ నోట్లో ప్రవేశించి హరీ మనేవో!) ఒణుకుతూ కూర్చొని అటుచూస్తున్నాడు. నేను నవ్వితే మరి ఆ చరిత్రాత్మకమైన పోజును చూసేభాగ్యం ఉండదనే భయంతో పొట్టపగిలే నవ్వు ఆపుకున్నాను. పదినిమిషాలు గడిచాయి. బావ కదల్లేదు. బావ చూసే భయంకర దృశ్యంఏమిటి? రాత్రి బిందెడు టీ స్వీకరించి కూడా ఎనిమిదిన్నరకే ముసుగుతన్ని నందుకు వాడి నిద్ర పరభృతం చేసే సదుద్దేశంతో సాయుధుడై ప్రవేశించేమావయ్యా? మావయ్యలేడే! లేక పరీక్ష టైంటబిలా? (ఆ రోజే ఇంగ్లీషుపరీక్ష). అదీ కాదే మరేమిటి?

బావ పదినిముషాలు కళ్ళని కష్ట పెట్టి పిండిన కష్టార్జితం కన్నీటిని క్రిందికి విడిచేశాడు నా కేసి తిరిగి. ఏదో చెప్పబోయాడు. మాట రాలేదు. ఆ భయంకర దృశ్యం కేసి చెయ్యి చూపేడు. ఏమిటది! పరపురుషుల కంటపడ్డానని సిగ్గుపడ్డ కాకోలు తల వంచుకు పోతున్న మా ఇల్లాలు తెల్లపిల్లి! నాకు విచారం కలిగింది, లేవగానే పిల్లిని చూశానని కాదు (నాకు శకునాల్లో నమ్మకంలేదు), అట్లాగని బావ అంత బాధ తున్నాడని. బావ ముఖంలోకి చూశాను మూతి వంకరగా పెట్టి.

బావ గోదావరి వరదలలో కొత్త మొన కొట్టుకుపోయిన ఆసామీలా ముఖంపెట్టి కన్నీరు కార్చాడు. 'ఇవాళ నాకేదో గండంఉంది" అన్నాడు అతి కష్టంమీద. నేను నవ్వుతూ "మహా అయితే మావయ్య 'హిందూ' చదివిస్తాడు. అంతకన్న ప్రమాదం ఏంఉండ మతే" అన్నాను. బావ ఇంగ్లీషు చదవటం కుంటివాడి నృత్యంలా చూసేవారికి మంచి వినోదకరంగానూ, వాడికి ప్రమాదకరంగానూ

(40 వ పేజీ చూడండి)

# చైనీస్ కథలు: ఫెంగ్ స్వే - ఫెంగ్



## 1. అపకారులు, ఉపకారులు

ఒకరోజున ఒక రైతు పొలానికి వెళ్లాడు. గోధుమ బాగా పండిఉన్నది కోత ప్రారంభించాడు. ఇంతలో పిచ్చికల గుంపొకటి గోధుమ కంకుల మీద వ్రాలింది. అవి రైతుతో ఇలా అన్నాయి:

"మిత్రుడా! పాపం నువ్వు చెమటోడ్చి కష్టపడి పని చెయ్యడమే కాక, మాకు కూడా కడుపునిండా తిండి పెట్టావు. నీమేలు మేము మరిచిపోలేదు. ఇప్పుడు అందమైన వసంత ఋతువు ప్రారంభం కాబోతోంది. నువ్వొక ఊపిరి సలపని పనిలో మునిగి ఉంటావు. నువ్వు పని చేస్తూంటే మేము చక్కని పాటలు పాడి నీకు శ్రమ అనిపించకుండా చేస్తాము. ఈవిధంగా నీ ఋణం తీర్చుకుంటాము." ఇలా అంటూ ఆ పిచ్చికలు కిచకిచమని ఏవో ధ్వనులు చేస్తూ, పొలమంతా తిరగడం మొదలెట్టాయి. తిరుగుతూ దేనికి దక్కినంత అది గోధుమగింజలు బొక్కడం ప్రారంభించాయి.

రైతుకు కోపం వచ్చింది. మట్టిబెడ్డలు విసిరి వాటిని తోలేశాడు. "ఛీ, మాయదారి పిచ్చికలు! వచ్చి మా పంటంతా దోచుకుంటాయి. పైగా తిండిపెడుతున్నందుకు కృతజ్ఞత తెలుపుతున్నాయి. ఈ పిచ్చికల పిచ్చిపాటలు వినడానికే కూర్చున్నాను గావును ఇక్కడ! ఇల్లాంటి స్నేహితులు నా కక్కరలేదు. ఈ కవిగాళ్ళను తరిమి పారేస్తాను," అనుకున్నాడు.

పిచ్చికలు ఎగిరిపోయిన తరవాత కొన్ని భరద్వాజ పక్షులు గోధుమ చేలో వ్రాలాయి. అవి గోధుమ గింజలను ముట్టుకోలేదు. సరాసరి పురుగులను తినడం మొదలెట్టాయి. ఇక్కడో మిడతనీ, అక్కడో గొంగళిపురుగునీ పట్టుకుని ఏరివేశాయి. అలా కనిపించిన ప్రతి పురుగునీ తినివేసి మళ్ళీ ఆకాశంలోకి ఎగిరిపోయాయి. పైపైకి ఎగిరిపోతూ అద్భుతమైన పాట పాడాయి. ఆ పక్షుల మధుర సంగీతంతో ఆకాశం అంతా నిండిపోయింది. ఆ పాట విన్న వారందరి హృదయాల్లో ఆహ్లాదం నిండిపోయింది. నడుం వంచి పనిచేస్తున్న రైతుకూడా కొన్ని క్షణాలు తల పైకెత్తిచూసి పాట విన్నాడు. మళ్లీ తల దించి పనిచేసుకుంటూ ఇలా అనుకున్నాడు:

"భరద్వాజ పక్షులు మంచివని పెద్దలన్న మాట అబద్ధంకాదు. వీటికి ఒక్క గింజకూడా పెట్టవలసిన అవసరం లేదు. అవి ఇతరుల సొమ్ము ఒక్క గింజయినా ముట్టుకోవు. పైగా పంటలకు హానిచేసే మిడతలను, పురుగులను చంపి తిని ఎంతో ఉపకారం చేస్తాయి. ఆ తర్వాత తమదారిని తా మెగిరిపోతూ ఎంతో ఆనందం కలిగించే కమ్మని సంగీతం వినిపిస్తాయి. వాటిని చూస్తుంటే కళ్ళకి పండగగానూ, వింటుంటే చెవులకి పండగగానూ ఉంటుంది. కవులంటే అవే కవులు. ఇటువంటి కవులే దేశానికి, ప్రజలకి స్నేహితులు. ఇటువంటి కవులే మనకి కావాలి."

## 2. మబ్బులు, కొండలు

విశాలాకాశంలో విహరించే విహంగం ఒకటి దూరాన కనిపించే తెల్లని మబ్బునిచూసి "ఆ మబ్బు దగ్గిరికి పరుగెత్తుతాను. దానితో సమంగా, అది ఎటుపోతే అటే పోతాను," అనుకున్నది.

రెక్కలు బాగా విప్పార్చింది. యావచ్ఛక్తీ ఉపయోగించి బాణంలాగ దూసుకొనిపోయింది. మరి కొన్ని క్షణాల్లో తెల్లమబ్బును సమీపిస్తుంది. కాని మబ్బు ఇంతలో ఏమనుకున్నదో ఏమో ఒక క్షణం తూర్పువైపూ, మరోక్షణం పడమటి వైపూ తేలిపోసాగింది. మరో క్షణంలో నిశ్చలంగా నిలబడి, బొద్దింకను పట్టుకోడానికి పిల్లికూన చుట్లు తిరిగినట్టు, తన చుట్టూ తానే గుండ్రంగా తిరగసాగింది. ఇంకో క్షణంలో, అందమైన స్త్రీ మేలిముసుగును మెల్లిగా తొలగించి బద్ధకంగా వళ్లు విరుచుకున్నట్టు, విశాలంగా విప్పారింది. అంతేకాదు, మరికొన్ని క్షణాల్లో, ఉన్నట్టుండి ఆ తెల్లమబ్బు దూదిపింజలవలె విడిపోయి, పొగమంచులాగ చెదరిపోయి చూస్తుండగానే అంతర్ధానమైంది.

అప్పుడు పక్షి అనుకున్నది: "అబ్బే. ఈ మబ్బులతో లాభం

లేదు. మానవజాతికి రూపం మార్చి వేసే మబ్బుల్ని నమ్ముకుంటే అయినట్టే! అవిగో, దూరాన గంభీరంగా, నిశ్చలంగా, దృఢంగా తలలెత్తుకుని నిలబడిన పర్వత శిఖరాలు! వాటిని నా లక్ష్యాలుగా పెట్టుకుంటాను. ఆ శిఖరాలు ఎంత అందంగా, ఎంత ఉన్నతంగా, దృఢంగా ఉన్నాయి! వాటిని చూస్తుంటే నాలో ఎంత ఉత్సాహం, ధైర్యం కలుగుతోంది! శిఖరంనుంచి శిఖరానికి పరుగులు తీస్తాను. అప్పుడు నా ఆనందం వర్ణించడం ఎవరి తరం?"

నీతి:- సుస్పష్టమైన, నమ్మకమైన మార్గాన్ని చరిత్రే చూపిస్తుంది. ప్రజాశ్రేయస్సును సాధించడానికి ఆ మార్గమే మనం అనుసరించాలి. ★

## ★ శకునఫలం ★

(47-వ పేజీ తరువాయి)

ఉంటుంది. నిద్రపోతున్న 'మావయ్య బెత్తం' ఎప్పుడు కళ్లు తెరిచి చిందులు తొక్కుతుందో నన్న భయం వాడి కంఠంలో గంతులు వేయడంచేత ఆ కంఠంలో ఏడుపు ధ్వనిస్తూఉండగా, వాడు ఆ ఆపత్సమయంలో ఒచ్చిన మాటలు కూడ మరిచిపోతాడు. ఐ ఎస్ ఊజ్ అనేది మరిచిపోతాడు. "ద్రిప్రెసిడెంట్ ఐ ఎస్ మేకింగ్... బాబోయ్" అంటాడు రెండోదెబ్బపడే ప్రమాదాన్ని పసికట్టి.

బావ నా అపహాస్యాన్ని అసహ్యించుకున్నా సహించి అన్నాడు. "పరీక్షలలో లేవగానే పిల్లినిచూస్తే నూటికి ఐదుమార్కులు తగ్గిపోతాయట" "నాకు లేని ఏడుపు నీకు మాత్రం ఎందుకు?"అన్నాను నేను. "నీకేం! నీకు ఏడెబ్భై మార్కులో రావలసింది అరవై ఐదువస్తాయి. నాకు ముప్ఫైఐదు ఒచ్చేవి.." విచారభావంతో బావగొంతు బొంగురుపోయి ఆగిపోయింది. "పిల్లినిచూడకపోయినా పేసయిపమస్తా వేమిటి! ఇప్పుడు నువ్వు చదివినా పిల్లిని చూడడంవల్ల ఫేయూవనే నదభిప్రాయం, సానుభూతి, సెప్టెంబరుకు సహకారం......" నిలువుటద్దంలో నాన్నగారు నవ్వుతున్నారు. నేను నోరు మూసుకున్నాను. పరీక్షలలో ప్రతిరోజూ లేవగానే కనపడేది ఆ పిల్లి, రెండుపిల్లల కన్నతల్లి. "పుని స్త్రీయేకదూ, ఫరవాలేదు." అని బావకు అభయమిచ్చాను.

* * *

మార్కులు తెలిశాయి. నాకు అన్నీ డబ్భైపైనే వచ్చాయి. అన్నీ ఫస్టుమార్కులే. ఎప్పుడూ అన్సరు పేపరుమీద 'నలభై' చూడని బావకి అన్నీ నలభైఐదు పైన వచ్చాయి. "యూనివర్సిటీ ఫస్టుకీ నీకూ ఎంత తేడా?" బావ అడిగాడు. "ఇంక పదహారుమార్కులొస్తే నాది యూనివర్సిటీ ఫస్టు" నేను ఉత్సాహంగా అన్నాను. "పిల్లిని చూడకపోతే తప్పకుండా ఒచ్చేది." బావ బాధగా అన్నాడు. నామార్కులుచూసి బావఏనాడూ ఈర్ష్యచెందలేదు. ఇప్పుడు సానుభూతిచూపిస్తున్నాడు నాకు యూనివర్సిటీ ఫస్టురాలేదని. నాకు గుండెల్లో ఏదోచురుక్కున తగిలినట్లయింది. బావ చెప్పింది నిజమేనేమో! "కాదు" అని సరిపెట్టుకున్నా. ★

## దత్తుడు

(12వ పేజీ తరువాయి)

"ఇంతకాలం శాఖలో లోటుందనుకున్నానులే. బహుశా పొరపాటుపడ్డానేమో. ఇంతకీ ఆ అమ్మాయి కిష్టమని నీకెలా తెలుసు? నీతో చెప్పిందా?"

"నోటితో చెప్పాలిటోయ్, దద్దమ్మాయ్! ఆమోమే చెబుతోంది. అనవసరంగా భయపడకు. ఆ అమ్మాయి నిన్నుతప్ప ఇంకొకర్ని చేసుకోదు."

'సరిసరి అదికూడానా?' అని గొణుక్కుంటూ తన గదిలోకిపోయి తిరిగి కోడ్ పాసు తీశాడు. కాని కోడ్‌పాసుకూడా అతనికి సంతోషాన్ని కలిగించలేకపోయాడు. ఇంతలో 'ఏమండీ' అంటూ ఆ లతమ్మ వచ్చింది. ఆమె 'ఏమండీ' అని దీర్ఘాలు తీస్తూ పిలిచినప్పుడల్లా అతనికి క్వినయిన్ మాత్ర మింగినట్లే వుంటుంది.

"సరుకులన్నీ తెచ్చేశానుగా!"అన్నాడు.

"అది సరే. దానికేంతయినది. అకోంటు కొంచం చెప్పాల్సింది. అవిడివన్నీ పాపం జాగ్రతగా పద్దు వ్రాసుకుంటుంది."

"ఈ లక్షణంకూడా వుందీ? హరి భగవాన్లూ" అనుకున్నాడు. ఆ అనుకున్నది తనలో అనుకుంటే తీరిపోయేది. కాని పైకి గట్టిగా అనుకున్నాడు.

"ఏమిటీ?" అందామె.

"అబ్బే, ఏమీ లేదూ. ఇంతవరకూ నాకు మందమతివొక్కటే లేదనుకున్నా. కాని ఇప్పుడుచూస్తే ఆ లక్షణంకూడా నాలో వున్నట్టుంది. మీపద్దు మరిచిపోయాను."

"ఫోన్లెండి, ఫరవాలేద"ంటూ వెళ్లిపోయింది. అది కొంత నయమనుకున్నాడు. కాని ఎంతకాలం పోన్లెండని వూరుకుంటుందో అతను వూహించుగోలేకపోయాడు. ఆమె ఆ విధంగా ఎందుకు ప్రవర్తిస్తుందో అతని కర్థం కాలేదు. తనని బాసు చేసే బాధ్యత ఇప్పటినుండి పైన వేసుకుందా? లేక తన పిన్నిలాగే యీవిడకి ఇది అలవాటా?

అతనికి విధిమీదా, విచిత్రాలమీద నమ్మకం లేదు. కాని యీ సమయంలో ఏదైనా విచిత్రం జరిగి తనావూరినుండి వెళ్లిపోగలిగితే బాగుండుననుకున్నాడు. మర్నాడతనిపేర నో టెలిగ్రాం వచ్చింది ఆఫీసునుండి. ఆఫీసులో ముగ్గురు హఠాత్తుగా మెడికల్ లీవు మీద వెళ్లిపోయారుట. శ్రీనివాసరావు కత్యంతిరం లేకపోతే సాధ్యమయినంత త్వరగా వచ్చి పనిలో చేరవలసిందని వుంది. అతను వెనుక చాలాసార్లు ఆఫీసుకి యీ విధంగా అక్కరకు వచ్చాడు. ఈసమయంలో ఇలా టెలిగ్రాం రావడంతో శ్రీనివాసరావెగిరి గంతేశాడు. అమాంతంగా పట్నంపోయి ఆఫీసరు బట్టతలపై ముద్దు పెట్టుగోవాలనిపించిం దతనికి. ఆ టెలిగ్రాం పుచ్చుకుని 'పిన్నీ' అంటూ లోపలికి పరిగెత్తాడు. ★

# బొంబాయి సినిమా లేఖ

పెట్టుబడి ధనంకోసం నిర్మాతలు పడే అగచాట్లను గూర్చి ఐ. ఎమ్. పి. పి. ఎ. వారు చాలా శ్రద్ధతీసుకుని చర్చించారు. ఫిలింఫైనాన్సు కార్పొరేషన్ త్వరగా స్థాపించడం అత్యవసరమని వీ రందరూ కలిసి ఎస్. కె. పాటిల్ గారి నాయకత్వాన ఒక నిర్ణయం చేశారు. దీనికి సంబంధించిన వివరాలన్నీ టిసీ తయారుచేస్తున్నారు. ఏదో ఒక రూపేణా ప్రభుత్వ సహాయంకూడా పొందాలని వారు ఆలోచిస్తున్నారు. ఈ ఫైనాన్సు కార్పొరేషన్ స్థాపింపబడితే ఫిలిం పరిశ్రమ చరిత్రలో అది ముఖ్యమైన ఘట్టం అవుతుంది. స్వయం సంస్కరణలకు అది దారితీస్తుంది. చిత్ర నిర్మాణం ప్రారంభించబోయే ముందే స్క్రిప్టు వగైరాలన్నీ నిర్దుష్టంగా ఉండే ఏర్పాటు చేయడానికి నిర్మాతలను అది ప్రోత్సహిస్తుంది. తారలను బుక్ చేయడంలో ప్రస్తుతం బ్లాక్ మార్కెట్, చాటుగా ఇచ్చి పుచ్చుకోవడం ఎక్కువగా అమలు జరుగుతోంది. ఈపద్ధతి ఫైనాన్సు కార్పొరేషన్‌ద్వారా అంతరిస్తుంది. ఎందుకంటే కార్పొరేషన్ సభ్యులు ఈమాదిరి అవాంఛనీయపద్ధతులను అవలంబిస్తే రెండోనాటికి కార్పొరేషనే అంతరిస్తుంది.

* * *

ఇటీవల బాగా ధనం ఆర్జించిన అమెరికన్ చిత్రం "ది ఫాబ్యులస్ సినోరిటా" చూసిన తరువాత అదే పంథాలో నృత్య, సంగీత, హాస్యచిత్రం హిందీలో తీయాలని పలుగురు నిర్మాతలకు ఆలోచన కలిగింది. కథకోసం వీరు వెదుకులాడనక్కరలేదు. బాక్సాఫీసు ఫార్ములాలన్నీ అమెరికన్ చిత్రంలో రెడీమేడ్‌గా ఉన్నాయి. పేర్లు, సంభాషణలు మార్చడమే తరువాయి.

బొంబాయి నిర్మాతలను ఆకర్షించిన మరొక తాజా చిత్రం ఎమ్. జి. ఎమ్. వారి "ఎకీనా" మద్యపాననిషేధానికి, గోవధ నిషేధానికి ప్రచారంగా ఈ చిత్రం చక్కగా పనికి వస్తుంది. ఇదికూడా సంగీత చిత్రమే.

* * * *

ఫిలిములనుండి విరమించుకుంటున్నానని ప్రకటించిన పద్మిని, లలిత ఆ అభిప్రాయాన్ని మార్చుకున్నట్లు కనిపిస్తుంది. ఏ. వి. ఎమ్. వారి "శివభక్త" గొప్ప విజయం పొందడంతో పద్మిని తిరిగి కొన్ని చిత్రాలలో నటించనున్నది. మద్రాసులోని మిడాస్ మువిటోన్ వారి చిత్రంలో ఆమె బుక్ అయినది. అందులో ఆమె బొంబాయి నటుడు సునీల్ దత్ తో కలిసి నటిస్తుంది.

* * * *

ఈమధ్య బొంబాయిలో "సాకానోట్" బిందియా, సర్దార్, చోరీచోరీ, అమర్ కీర్తన్ మొదలైన చిత్రాలు విడుదల అయినవి. "సాకానోట్", కొంతవరకు "సర్దార్" తప్ప మిగతావన్నీ చెప్పుకోదగ్గ విజయం పొందలేదు.



ఫిల్మిస్థాన్ వారి సినిమాస్కోప్ చిత్రం "బొంబే ఫ్లయిట్ 417"లో నటిస్తున్న విజితా భట్.

## సినిమా వార్తలు

కోల్బుకిగిన "రోజులు మారాయి" చిత్రాన్ని గాని కొద్ది మార్పులుచేసి తేలికగా విదేశాలకు పంపవచ్చు. తెలుగు నిర్మాతలు సమష్టిగా మన ఉత్తమ చిత్రాలను పైప్రాంతాలకు పంపించడానికి తగిన చర్యలు తీసుకోవాలి. కొంత ఆందోళనచేసి భారత ప్రభుత్వాన్ని ఇందుకు ఒప్పించాలి.

* * *

భారతప్రధాని నెహ్రూ రష్యా పర్యటనను వివరంగా చూపించే 15 రీళ్ల చిత్రాన్ని రష్యన్లు తయారుచేశారు. దీన్ని హిందీ వ్యాఖ్యానంతో సహా మనదేశమంతటా ఈ నెలలో విడుదల చేస్తారట.



ఎస్. ఎమ్. ఎస్. నాయుడుగారి "ఆజాద్" పొందినవిజయంతో దక్షిణ భారతనిర్మాతలు పలువురు తమ హిందీ చిత్రాలలోకి బొంబాయితారలను బుక్ చేయ నారంభించారు. దీనితో తారలఫీజు విపరీతంగా పెరిగిపోయింది. తత్ఫలితంగా నిర్మాణ వ్యయం ఎక్కువైపోతోంది. కాని దాక్షిణాత్య నిర్మాతలు అనుసరించే ఒకరకమైన బాక్సాఫీస్ సూత్రాలను అదేపనిగా ప్రయోగిస్తే ప్రేక్షకులు విసుగుచెందే అవకాశం, బోలెడు డబ్బు ఖర్చుపెట్టి తీసే ఆ చిత్రాలు పట్టుపడే ప్రమాదంకూడా ఉన్నది. విజయా ప్రొడక్షన్స్‌వారు తమ "మిస్సమ్మ" హిందీ చిత్రానికి నర్గీస్, దేవ్ ఆనంద్ లను ఏ. వి. ఎమ్. వారు "చోరీచోరీ" "భాయ్ భాయ్" చిత్రాల్లోకి నర్గీస్, రాజకపూర్ లను, అశోక్‌కుమార్, కిశోర్‌కుమార్, నిమ్మీలను బుక్ చేశారు. వాసన్ గారి "ఇన్సానియత్" లో దిలీప్, దేవ్, బీనారాయ్ నటిస్తున్నారు.

* * *

గత సంవత్సరం రష్యాలో భారతీయ చలనచిత్రోత్సవం జరిగింది. ఈ సంవత్సరం ఆఖర్లో భారతదేశంలో రష్యన్ చలనచిత్రోత్సవం జరుగబోతున్నది. డిసెంబరులో జరిగే ఈ మొదటి రష్యన్ చిత్రోత్సవ సందర్భంలో సోవియెట్ ఫిలిం వ్యక్తులలో అగ్రశ్రేణికి చెందిన పలువురు భారతదేశం వచ్చి తమ ఉత్తమ చిత్రాలు ప్రదర్శిస్తారు.

* * *

పాకిస్తాన్‌లో భారతీయచిత్రాలను ప్రదర్శించే విషయమై, ఉభయదేశాలకు సమాధానం కుదిరే అవకాశం పూర్వంకంటె ఎక్కువ ఉన్నదని పాకిస్తాన్‌లోని భారత హైకమీషనర్ ఇటీవల చెప్పారు. పాకిస్తాన్‌లో ఈ మధ్య కొన్ని భారతీయ చిత్రాలు ప్రదర్శింపబడడంతో వాటిపై అక్కడ బాగా ఆసక్తి కలిగింది. మార్కెటింగ్ అవకాశాలుకూడా వృద్ధిఅయ్యాయి. వీటిని పరిశీలించి ఒక ఒప్పందం కుదుర్చుకోడానికి ఈనెలలో ఉభయదేశాల ప్రతినిధులు కరాచీలో సమావేశమౌతున్నారు. వీరు ఇతర వ్యాపారవిషయాలతోపాటు ఫిలిం వ్యాపారాన్నిగూర్చి కూడా సంప్రదిస్తారు. ప్రభుత్వ ప్రతినిధులకు ఫిలిం విషయాలలో సలహాలివ్వడానికి భారతీయ ప్రతినిధుల సంఘం కూడా ఒకటి కరాచీ వెడుతుందని తెలుస్తోంది.

భారతదేశచరిత్ర చదివిన ప్రతివారికీ కలకాలం జ్ఞాపకం ఉండే పేర్లలో చైనీస్ బౌద్ధ యాత్రికుడు యువాన్ చ్వాంగ్ పేరొకటి. ఈ యాత్రికుని జీవితకథను, ముఖ్యంగా అతని యాత్రాకథను చిత్రంగా నిర్మింపదలచినట్లు దేవ్ ఆనంద్ సోదరుడు, నిర్మాత అయిన చేతన్ ఆనంద్ ఇటీవల వెల్లడించారు. బౌద్ధ మతాభిమాని, సంస్కృత నాటకకర్త అయిన హర్షచక్రవర్తి కాలంలో యువాన్ చ్వాంగ్ చైనా నుండి కాలినడకను భారతవర్షం వచ్చి ఇక్కడ కొన్ని సంవత్సరాలు పర్యటించి వెళ్ళాడు. ఆ రోజులలోని జీవనపరిస్థితులను వాస్తవికంగా చూపే చారిత్రిక చిత్రంగా దాన్ని నిర్మించాలని చేతన్ ఆనంద్ సంకల్పిస్తున్నారు.

* * *

హాలీవుడ్ భారతీయ నటుడు సాబూ తిరిగి భారతదేశం వస్తున్నాడు. మెహబూబ్ తీస్తున్న క్రొత్త చిత్రంలో అతడు నటిస్తాడు. మెహబూబ్ పూర్వం తీసిన



ప్రముఖ హిందీనటి గీతాబాలి.



ఆర్. ఎస్. ఫిలిమ్స్‌వారి "సౌ కా నోట్" లో మనోరమ.



విఠల్ ప్రొడక్షన్స్‌వారి "కన్యాదానం"లో హేమలత, దొరస్వామి, జానకి.



గ్యాన్ ముఖర్జీ నిర్మించిన "సర్దార్"లో అశోక్‌కుమార్.



# బొంబాయి సినిమాలేఖ

"ఔరత్" కథయే ఈ కొత్త చిత్రానికి ఆధారం. ఇందులో ముఖ్యమైన తల్లిపాత్రను నర్గీస్, దుర్మార్గుడైన ఆమె పుత్రునిపాత్రను సాబూ ధరిస్తారు.

* * *

రెండేళ్ల క్రిందట "తాజ్ మహల్" అనే పేరుతో ఒక చిత్రం నిర్మించదలచి, తరువాత విరమించిన ప్రసిద్ధ బ్రిటిష్ దర్శకుడు డేవిడ్ లీన్ తిరిగి వచ్చే జనవరిలో భారతదేశం వస్తున్నాడు. ఈసారి "విండ్ కెనాట్ రీడ్" అనే చిత్రం భారతదేశంలో జరిగినట్లు వ్రాయబడిన కథతో ఆయన నిర్మించనున్నాడు. అందులో జపానీస్ నటి కీకో కిషి నటిస్తుంది. ఈమె ఈ సంవత్సరం ఆగ్నేయాసియా గలచిత్రోత్సవంలో ఉత్తమ నటి బహుమతిపొందింది. సినిమాస్కోప్‌లోనూ, రంగులలోనూ ఈ చిత్రం తీయబడుతుంది.

* * *

విజయా ప్రొడక్షన్స్‌వారు (మద్రాసు) నర్గీస్, దేవ్ ఆనంద్‌లతో, రంగులలో తీద్దామనుకున్న "మిస్సమ్మ" హిందీచిత్రం నిర్మాణాన్ని వాయిదా వేసినట్లు తెలుస్తోంది.

(కాంగ్రెస్ వారపత్రిక బొంబాయి విలేఖరి)



---

సవరణ

22-6-55 తేది సంచికలో లోపలి ముందటి కవరు ఫోటో ఎస్. వెంకటకృష్ణన్ (మద్రాసు), రెండవ కవరు ఫోటో గోపాల్ (మద్రాసు) పంపినారని గ్రహించ ప్రార్థన.—సంపాదకుడు.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## చిట్టిప్రశ్నలు జవాబులు

యం. వి. రా. సామర్లకోట.

—చంద్రుడికి చుట్టూ గుడి కట్టినట్లైతే వర్షాలు కురుస్తాయని పెద్దలు చెప్పేమాట అనుభవమునుబట్టి చెప్పినదే కాని పరిశోధన వల్ల చెప్పినదికాదు. ఏమంటారా? చంద్రుడికి గుడి కట్టినప్పుడల్లా వర్షాలు కురిసి తీరవు. కొన్నిమారులు కురుస్తూ ఉండవచ్చును. దానికి కారణ మిది:

గాలిలో నీటి ఆవిరి జాస్తిగా వుండినప్పటికీ ఆ ఆవిరి నీటిబిందువులుగా మారడానికి చిన్నచిన్న ధూళికణాలో, మంచుకణాలో, మరో రకపు కణాలో అవసరము. మంచుకణాలు ఆకాశంలో విరివిగా ఉన్నప్పుడు, ఆ కణాలలోంచి ఒక వాటంలో ప్రసరించే వెల్తురు వంగి మన కంటికి చేరుతుంది. మామూలుగా తిన్నగా వచ్చి మన కంటికి చేరే వెలుతురుతోపాటు వంగి వచ్చే వెల్తురు కూడా చేరడమునించి అంత మేరా వెల్తురు గుడి కట్టినట్టు కనబడుతుంది. కనక, చంద్రుడి ఉన్నప్పుడు పై గాలిలో మంచు కణాలున్నాయన్నమాట. అవి వానరాకటకి సాయపడవచ్చును. కాని తప్పకుండా వాన కురిపిస్తాయనడము తప్పు. గాలిలో నీటి ఆవిరి జోరుగా ఉండి, చల్లబడితే, ఈ కణాల చుట్టూ ఆ ఆవిరి బిందువు కట్టవచ్చును.

ఇక "చంద్రపరివేషము కట్టిన నాలుగు రోజులకి వర్షము కురుస్తుంది" "ఆరు రోజులకి కురుస్తుంది" అన్నవి గుడ్డివాడి చేతిరాళ్లు. తగిలితే తగులుతుంది లేకపోతే లేదు.

* * *

టి. శ్రీహరిరావు, అనకాపల్లి.

—వేసవిలో నిండు కూజాను తడితే చల్లగా, తేమగా ఉన్నట్టు కనబడుతుంది గదా? భూతద్దముతో పరిశీలిస్తే ఈ తడి ఇంకా స్ఫుటముగా కనబడుతుంది. కూజా గోడలలో వున్న సూక్ష్మరంధ్రములద్వారా నీరు పైకిచిమ్మి, బయట ఆవిరి అవుతుంది. ఇలాగ ఇగిరిపోడానికి కావలసిన ఉష్ణతని కూజానీరు పప్పైచేశేసి తాను చల్లబడుతుంది. బిందెకు సూక్ష్మరంధ్రాలు లేవు. కనక నీరు చిమ్మనూ చిమ్మదూ, ఇగిరిపోనూ పోదు, లోపలి నీరు చల్లబడనూ చల్లబడదు. అయితే తడిగుడ్డని బిందెకి అంటేటట్లు చుట్టితే, ఆ తడిగుడ్డలోని నీరు ఇగిరిపోయి, బిందె, తద్వారా బిందెలోని నీరూ చల్లబడడము కూడా కద్దు.

పాతకాలల్లో బీకరు అనే పలుచని గాజు పాత్రని కర్రపలకమీదపోసిన నీటి మీద కూర్చుండబెట్టి, ఆ గాజుపాత్రలో పెట్రోలు వంటి ఈథరు ద్రవాన్ని పోసి ఆ ద్రవము గుండా సైకిలుపంపుతో గాలి కొట్టుదురు. ఈథరు ఇగిరి, అందుకు కావలిసినఉష్ణమును నీటినుంచి తీసుకోవడమువల్ల నీరు గడ్డకట్టి గాజు బీకరు కర్రపలకకి అంటుకుంటుంది.

ఐస్‌ఫ్రూటు అనే మంచుగడ్డ కణికెలు తయారుచెయ్యడానికి అమ్మోనియా అనే ద్రవమును ఈ పథకముమీదనే ఉపయోగిస్తారు.

* * *

యస్. పేరాజు, నిర్మల.

—తోకచుక్కలు రావడానికి ప్రపంచోపద్రవాలకి సంబంధము లేదు. సామ్రదికమూ, శకునమూవంటిదే తోకచుక్క.

—స్త్రీపురుషులలో, బిడ్డలనుకని పెంచుదురు కనుక స్త్రీలకు, జీవనాధారమును సాధింతురు కనుక పురుషులకూ ప్రాధాన్యత. సైన్సు దృష్టిలో ఇద్దరూ ప్రధానులే.

అయితే మొక్కలలోనూ, సూక్ష్మప్రాణులలోనూ స్త్రీ పురుష భేదముతో నిమిత్తములేకుండా సృష్టి జరిగిపోతుంది. అరటిచెట్లూ, క్రోటనులూ, గన్నేరూ, ఇత్యాది మొక్కలను మీరు గుర్తించే వుంటారు. అయితే పెద్దజాతి ప్రాణులలో రెండు రకాలూ తప్పవిసరి. ఎవరూ ప్రధానులు కారు, ఇద్దరూ ప్రధానులే.

* * *

కొడ్డు సుబ్బారావు, విశాఖపట్నం.

—విజ్ఞానశాస్త్రానికీ ఆధ్యాత్మికశాస్త్రానికీ సమాన ఆధారము ఒక్కటే—అనుభవము. అయితే వైజ్ఞానికానుభవమును అందరూ అన్నికాలాలా పొందవచ్చును. ఆధ్యాత్మికానుభవమును ఎవరో కొందరు అదృష్టవంతులు మాత్రమే పొందుదురు. మనందరికీ మనము ఎన్నడో ఒకనాడు మరణింపకతీరదని తెలుసును. కాని అడుగడుగుకీ మైమరపు. 'ఆ ఘడియ' వచ్చినవే జ్ఞానోదయమౌను. ఈ సంగతిని విజ్ఞాన శాస్త్రమూ వివరింపదూ ఆధ్యాత్మిక శాస్త్రమూ వివరింపను. మరి రెండు శాస్త్రాల కారణమున్న సంగతి తెలుసుకోగలమా? మీ కేది యుక్తమైతే అదే నమ్మండి.

* * *

ఏ. ఎస్. సాంబశివరావుగారు, వి[illegible]కోలు.

—అభేదానందగారి *Life after death* ఏమీ చదవలేదు. అయితే ఆత్మలు బెంగాలీ, సంస్కృతము, ఇంగ్లీషు, గ్రీకుభాషల యందు రాయవలసిన అవసరమేమిటో మాకు తెలియలేదు. జవాబు బెంగాలీలో అడిగితే నాలుగు భాషలలో ఎల వచ్చినదీ? ఆ ఆత్మ శరీరత్యాగము చేసిన పిమ్మట నేర్చుకున్నదా ఆ లిపులూ భాషలూనూ? ఇదంతా అతిలోకముగా ఉన్నది. అనుభవము లేకుండానే ఇది నమ్ముట మాకు కష్టముగానున్నది. చెయిలేకనే రాసిన ఆత్మ నోరు లేకనే మాటలాడలేక పోయినదా?

ఆత్మ శబ్దము ఎలాగు చేసింది?

* * *

ఏలూరి వీరరాఘవరావు, నిడదవోలు.

—తలక్రింద ఎత్తుగా తలగడ లేకపోతే నిద్ర ఎందుకు పట్టదంటారా? మీరు చేసుకున్న అలవాటువల్ల. తీర్థమునకు వచ్చే పాటకజనం ఎలాగు నిద్రపోతున్నారూ?

* * *

వి. వి. రమణమూర్తిగారు, ద్వారపూడి.

—అన్ని వూళ్లలోనూ నీరు పైపుల నిండా ప్రవహిస్తుంది. సిమ్లా, ఇంగ్లండూ వంటి శీతలప్రదేశాలలో నీరు ఘనీభవించేటంత చలి వుంటుంది. నీరు మంచుగడ్డగా మారినప్పుడు దాని పరిమాణము (*Volume*) పెరుగుతుంది. అందువల్ల పైపులలో నీరు గడ్డకట్టినప్పుడు పైపులు విచ్చిపోతాయి. ★



మహాబలిపురంలో ఏనుగు శిల్పం

ఫోటో : జి. రామమూర్తి—మదరాసు.

